


# చింతామణి

పద్మవ్యూహ చిత్రాభ్యుదయాది గ్రంథకర్త

మహాకవి

## కాళ్లకూరి నారాయణరాయ

ప్రణీతము.

నాలవ కూర్పు 3,000 ప్రతులు.







కాకినాడ

సుజనరంజనీ ముద్రాశాలయందు

ముద్రితము.

**1923**

వెల 1—2—0

# అవతారిక

సకల పురాణజ్ఞు లయిన మాతండ్రిగారు, చిన్ననాఁడు నన్నుఁ బ్రక్కను బరుండఁబెట్టుకొని, చిత్రవిచిత్రములైన పురాణకథల నెన్నిటినో మెదటిలోని కెక్కించి, అయిదాఱువత్సరముల ప్రాయము వచ్చుసరికి అనేకకథలను నేను మరలఁ జెప్పఁగలుగునట్లుచేసిరి. అక్షరజ్ఞానమమరినవెనుక నావిన్నగాథలను స్వయముగాఁ జదువుకొని యానందింపవలెనను నభిరుచి జనించి- చివర కాయభిరుచియే- యింగిలీషునెడఁ బ్రాలుమాలికయు, నుద్యోగపదవియెడ నేహ్యబుద్ధియుఁ గలిగించి-ఆంధ్రభారతికి నన్ను శాశ్వత సేవకునిగాను, ఉపాసకునిగాను జేసివైచినది. ఆనాఁడు మాతండ్రిగారివలన విన్న కథాపరంపరలో లీలాశుకచరిత్ర మొకటియై యుండెను, ఆ కథాబీజ మాధారముగా నీచింతామణి యందలి యితివృత్తము కల్పింపఁబడినది. ఇతివృత్తమునుబట్టి యిది ప్రకరణమై- ప్రథమాంధ్రప్రకరణకర్తృగౌరవము నాకు దక్కినది.

## నా ల వ కూ ర్పు.

మూఁడవకూర్పు ప్రతులుకూడ మూఁడునాలుగు మాసములలోనే నైపోయినవి. ఆంధ్రదేశమున దీనిపే రన్నిమూలల కంగున మ్రోఁగుచున్నది. పల్లెలలోఁగూడ దీనిప్రదర్శనములు పరంపరగా జరుగుచున్నవి. పవిత్రమైన యీ నాటకముయొక్క ప్రథమ ప్రదర్శకులు బందరు రామమోహన నాటకసంఘమువారు. ఇప్పటి కేసంఘమువల్లనైన నేమి-నాలుగువందల నలుబదియాఱు ప్రదర్శనములు నాలెక్కకు వచ్చినవి. వర్తకులుకొందఱీవ్యాప్తి చూచి, కడుపుకక్కుఱితిగాండ్రకు గంజినీళ్ల కిచ్చి, మాచింతామణి పోలికలతో మాయ చింతామణులను గోకించి, పట్టపగటి దొంగతనముగ బాజారులం ద్రిప్పుచున్నారు! ఇప్పటి కీవిధముగ మాచింతామణికి నాలుగు పిల్లచింతామణులు పుట్టినవి! మసిపూసి మారేడు నేరేడన్నను, సన్నముముదుగులు సంతలోఁ దేలక మానవు కాని- ఈ గుజిలీమోస మెఱుఁగనివా రిదియె యనుకొని వానిం గొని, తరువాతఁ దెల్లపోవుట తటస్థించుచున్నది !

ఈ కూర్పునందును గొన్నిమార్పులును గొన్ని చేర్పులును గావింపఁబడినవి. ప్రదర్శనమునందు విసువుగ నుండు భాగములు తగ్గింపఁబడినవి. భగవంతుఁడు దీని నింకను వ్యాప్తిలోనికిఁ దెచ్చి, పాపభూయిష్టమగు వ్యభిచారవృత్తిని బరిపూర్తిగ నిర్మూలించుఁ గాక!

కాకినాడ
10-1-23

మహాకవి
కాళ్లకూరి నారాయణరావు.

**Fame, as a river, is narrowest where it is bred, and broadest afar off. So exemplary writers depend not upon the gratitude of the world" Devenant.**

---

# ఇందలి పాత్రములు.

1 బిల్వమంగళుఁడు—కథానాయకుఁడు.
2 వాసుదేవమూర్తి—బిల్వమంగళుని తండ్రి.
3 దామోదరుఁడు—బిల్వమంగళుని మిత్రుఁడు.
4 భవానీశంకరుఁడు—ఒక విటుఁడు.
5 సుబ్బిసెట్టి—మఱియొక విటుఁడు.
6 సోమగిరియోగీంద్రుఁడు—బిల్వమంగళుని గురువు.
7 శ్రీకృష్ణుఁడు.
8 రాధ—బిల్వమంగళుని ధర్మపత్ని.
9 చింతామణి—కథానాయికయగు వేశ్య.
10 శ్రీహరి—చింతామణి తల్లి.
11 చిత్ర—చింతామణి పెంపుడు పరిచారిక.

---

# ప్రకటన

లిఖితరూపకమగు నాయనుమతిని పొందనివారు

## ఈనాటకమును ప్రదర్శింపఁ గూడదు.

గ్రంథకర్త.

శ్రీ

మేధాదక్షిణామూర్తి పరబ్రహ్మణేనమః






## నాంది

ఉ. భామలపైఁ బసిండిపయి • భ్రాంతిఁ ద్యజించి, విశుద్ధ తత్త్వ బో.
ధామృతముం గ్రహించి, సము • దంచిత వృత్తిఁ జరించు సజ్జన
స్తోమములం గృపాజలధిఁ • దోఁగఁగఁ జేసి భరించు భక్తచిం
తామణి యైనయీశ్వరుఁ డు • దారమతి న్దరిఁ జేర్చు మిమ్ములన్

## ప్రస్తావన

సూత్ర—(ప్రవేశించి సభాభిముఖుఁడై) ఓ విద్వజ్జన మహాజనులారా! యేయదృష్టవంతుఁడు రాజాధి రాజులకుం గూడ లభ్యము కాని బహుకృతి స్వీకార భాగ్యమునకుఁ బాత్ర మయ్యెనో, యేపవిత్ర చరిత్రుని కీర్తిసౌధము శాశ్వత మూలబంధములపై విరాజిల్లుచు, సంతస్తులపై సంతస్తులతో నంతరిక్షమునకుం బ్రాఁకుచుండెనో, అట్టి బుద్ధిరాజు వీరభద్రరాయామాత్యున కంకితముగా—మహాకవి కాళ్లకూరి నారాయణరాయనిచే రచియింపఁబడిన శాంతరస ప్రధాన మగు చింతామణీ ప్రకరణ ప్రదర్శనమును విలోకించు నిమిత్తము మీ రందఱు విచ్చేయుటంజేసి నేఁడు మాపాలిటి భాగ్యదేవత ప్రప న్నమైనట్లు భావించు చున్నారము. ఏ మనుచున్నారు ?—

" గీ. శాంతిలేఁ బ్రపంచ దావాక • సమరవహ్ని
శాంతిలె సమస్త మానవ • స్వాంతములును
శాంతి సర్వత్ర యిట్లు పా • సంగునపుడు
శాంతరస రూపక ప్రద • ర్శనమె లెస్స. "

అనియా ?—చిత్తము చిత్తము. (తెరవంకఁ జూచి) పిలువవలె
నను కొనుచుండఁ బ్రియురాలు తనంతఁ దానె వచ్చుచున్నదే !

నటి—(ప్రవేశించి) ఏమి ? మీరు పిలువనె లేదా ? పిలిచిన ట్లయినదే !

సూత్ర—అట్లయిన నది యీశ్వరాదేశము ! దీనింబట్టి యీశ్వరుఁడు
నేఁడు మననాటకమును దానె నడపఁ దలఁచినాఁ డన్నమాట !

నటి—ప్రాణేశ్వరా ! యీొక్క మననాటకమె యన నేల ?—జగన్నాటక
మంతయు నాయనయె కద నడపుచున్నాఁడు ?

సూత్ర—సెబాసు ! చక్కఁగాఁ బలికితివి !

చ. అటవి యగుం బురంబు, పుర • మాను మహాగహనాంతరంబు ; దు
ర్గతుఁడు యతీశ్వరుం డగుఁ, ద • రింపఁగనున్న యతీశ్వరుండు దు
ర్గతుఁ డగు; భాగ్యశాలి నిరు • పేద యగు, న్నిరుపేద భాగ్యసం
ఘటనము గాంచు; నీశ్వరుఁడె • కాక మ రెవ్వఁడు కర్త వీనికిన్ !

సరి కాని, సభ్యులు నాటక సందర్శనము కొఱకు వేగిరపడు
చున్నారు- పాత్రములను సిద్ధపఱిచితివా ?

నటి—సిద్ధపఱుచుటయే కాదు—ప్రవేశమున కనుజ్ఞ యిచ్చి కూడ
వచ్చినాను.

సూత్ర—మేలు ! ప్రాజ్ఞురాలైన భార్య కలిగినందులకు ఫల మిది !

తెరలో—సందేహ మేమి ?

గీ. కష్ట భరితంబు, బహుళ దుఃఖ • ఖప్రదంబు
సార రహితంబు, నైన సం • సారమందు
భార్య యను స్వర్గ మొకటి క • ల్పనము చేసెఁ
బురుషుల నిమిత్తము పురాణ • పూరుషుండు !

సూత్ర—సరి యిఁక నేమి ! రాధా బిల్వమంగళ వేషధారు లరుగో
ప్రవేశించుచున్నారు. మన మిఁక నిష్క్రమింతము రమ్ము.

(అని నటితో నిష్క్రమించును.)

ఇది ప్రస్తావన

---




## ప్రథమాంకము

రంగము—బిల్వమంగళుని శయనగృహము.

(శయ్యపయిఁ గూరుచుండి బిల్వమంగళుఁడును, భారతమును జేతఁ గొని యెదుట నాసనముపయిఁ గూరుచుండి రాధయుఁ బ్రవేశింతురు.)

బిల్వ—సందేహ మేమి?

గీ. కష్ట భరితంబు, బహుళ దుః ◆ ఖప్రదంబు,
సార రహితంబు, నైన సం ◆ సారమందు
భార్య యను స్వర్గ మొకటి క ◆ ల్పనము చేసెఁ
బురుషుల నిమిత్తము పురాణ ◆ పూరుషుండు.

కాని, యననుకూలవతి కానియెడల భార్యయే ప్రత్యక్షనరక మని కూడఁ జెప్పఁ దగును.

సీ. కాలు పెట్టినత్రోనె ◆ కాంతుని మెడ విర్చి
నిండుసంసారము ◆ రెండు చేసి
తనమగఁ డెంత యా ◆ ర్జనపరుఁ డైనను
పొరుగు పుల్లమ్మ కాఁ ◆ పురము మెచ్చి
ప్రాణేశుఁ డొకటి తె ◆ ల్పఁగఁ దా నొకటి సల్పి
యది యే మనఁగఁ గస్సు ◆ మనుచు లేచి
విభుఁ డెందులకు నేని ◆ విసిగి యొక్కటి యన
పెళ్లు పెళ్లునఁ బడి ◆ వేలు గుప్పి
పట్టఁజాలక పెనిమిటి ◆ యిట్టె యున్న
బావికిని నేతికిని వడి ◆ పఱుగు వెట్టి

భర్త యెముకలు కొఱికెడు • భార్యతోడి
కాఁపురముకంటె నిఁక నర • కంబు గలదె !

రాధ—ప్రాణేశ్వరా! మీరు చెప్పినది యథార్థమే కాని— (అని యంతలో నర్థోక్తి ననుసరించి) పోనిం డాఁపంగతి నాకెందులకు—

బిల్వ—చెప్పు చెప్పు—సందేహ మెందులకు ?— భార్యలను దుఃఖపెట్టు భర్తలుమాత్రము లేరా—యనియేనా నీ వనఁబోయినది ? లేకేమి !—

సీ. అర్థాంగలక్ష్మి యై • నట్టి యిల్లాలిని
దమయింటి దాసిగాఁ • దలఁచువారు
చీటికి మాటికిఁ • జిరబుర లాడుచుఁ
బెండ్లాము నురక యే • డ్పించువారు
పడపుఁగత్తెల యిండ్ల • బానిసీండ్రై ధర్మ
పత్ని యన్నను మండి • పడెడువారు
బయట నెల్లరచేతఁ • బడివచ్చి యింటను
పాలఁతి నూరక తిట్టి • పోయువారు
పెట్టుపోఁతలపట్లఁ గ • లట్టిలోటు
తిట్టు కొట్టులతోడను • దీర్చువారు
ఖలులు ! కఠినులు ! హీనులు ! • కలుషమతులు !
కలరు పురుషులలోనఁ బె • క్కండ్రు నిజము.

రాధ—కాని, యది సృష్టిరాహస్యములలో నొక్కటి యని నా నమ్మకము.

గీ. రూపవతియైన యువతికి • రూపహీను
సుగుణఖనియైన వనితకు • శుద్ధమూర్ఖు
నిట్లు వ్యత్యస్తముగఁ గూర్చి • యింతులను వి
ధాత శోధించుచుండును • దలఁచుగాను !
బాధిం

అయినను, భగవంతుఁడు నన్నుమాత్ర మట్టి పరిశోధనము పాలు సేయక,—

ఉ. చక్కని రూపసంపద, ప్ర • శస్తతరంబగు వర్తనంబు, పెం
పెక్కిన పాండితీపటిమ, • యేపగు ప్రేమ, సదా వ్యయించినన్
దక్కువకాని భాగ్యము, సు • ధారసబిందులు చిందు వాణి,యీ
ఫక్కిని బొల్చునిమ్మలను • భర్తగ నాకొనగూర్చె సత్కృపన్.

బిల్వా—(నవ్వి) వెఱ్ఱిదానా! అప్పుడే యేల సంతోషించెదవు! కాల మవిచ్ఛిన్న మైనది- వక్రబుద్ధి కలది! ఏమో యెప్పు డేవిధముగ మార్చునో యెవరు చెప్పఁ గలరు!

సీ. ఘనుని హరిశ్చంద్రుఁ • గాటికాపరిఁ జేసె,
మురసుతు సార్వభౌ • మునిగఁ జలిపె,
అల రంతిదేవు స • న్నాతురుఁ గావించెఁ
బేదకుచేలుఁ గు బేరుఁ జేసె;
ధర్మాత్ము బలిని బా • తాళంబునకుఁ ద్రొక్కెఁ,
గలుషాత్ము నహుషు స్వ • ర్గమున కెత్తె;
విప్రనారాయణు • విటునిగా నొనరించె,
నొడయనంబిని భక్తి • యుక్తుఁ జేసె;
కాల మన నిట్టిమహిమను • కలది యగుట
మానవుఁడు మేను విడిచిన • నుఱుదినమునఁ
గాక- సుగుణ దుర్గుణములుఁ • గలిమి లేము
లెన్నరా దని వచియింతు • రెల్లబుధులు.

(తెరలో కూనరాగము.)

బిల్వా—అదిగో కూనరాగము! దామోదరుఁడు దయచేయుచున్నాఁడు!

దామో—(కూనరాగముతో)

*మ. అరయన్ శంతనుపుత్రుపై, విదురుపై • నక్రూరుపైఁ, గుబ్జపై
నరుపై, ద్రౌపదిపైఁ, గుచేలునిపయిన్ • నందవ్రజశ్రేణిపైఁ
బరఁగంగల్గు భవత్కృపారసము నా • పైఁ గొంత రానిమ్ము నీ
చరణాబ్జంబులు నమ్మినాను జగదీ • శా! కృష్ణ! భక్తప్రియా!

*ఈపద్యము తిక్కన సోమయాజిగారిది.

(అని పఠించుచుఁ బ్రవేశించి) అదిగో! నే ననుకొనినట్లే యైనది! గుడిలోని బొమ్మలలాగున నిరువురుఁ గూర్చుండి పురాణ ముపక్రమించినారు!

రాధ—(నవ్వుచు) అన్నా! యిప్పుడే యారంభించినాము. ఎన్నియో పద్యములు కాలేదు. అదిగో నీయాసనము. నే డింతయాలస్యమైన దేమి?

దామో—(కూర్చుండి) అమ్మాయీ! నాయవస్థ యేమి చెప్పుదును! పైని బట్ట వేసికొని నడవలోనికి వచ్చుసరికి, పడిపోయినట్లు మీ వదెన పడమటింటిలోనుండి తుసుక్కున తుమ్మినది! అయినను, వెనుకతుమ్ము ముందునకు మంచిదందురుగదా యని మనసు సరి చేసికొని వీథిగుమ్మములోనికి వచ్చుసరికి పిల్లి యెదురైనది! ఆపాటున మరల లోపలికిఁ బోయి మీవదెనను రెండు తిట్టి, పైబట్ట దండెమున వేసి, రవంతసేపు చాఁప మీఁదఁ జదికిలఁబడి మరలఁ బ్రయాణమై వీథిగుమ్మములోనికి వచ్చితినిగదా—

బిల్వ—(నవ్వుచు) మరల మఱియొక దుశ్శకునమా యేమి!

దామో—మఱేమి?- నంబినాంచారమ్మ క్రొత్తకుండఁ జేత బుచ్చుకొని చక్కవచ్చినది! ఆపాటున నెక్కడ లేని కోపమును వచ్చినది కాని- అంతలో, రెండుదుశ్శకునము లొకసుశకునముతో సమానమన్నమాట జ్ఞప్తికి వచ్చి, హరినామస్మరణ చేసికొనుచుఁ జక్క వచ్చితిని. కాని, దుశ్శకునఫల మూరక పోవునా!- యేటికడకు వచ్చుసరికి నావవాఁడు మాయమయినాఁడు! అయినను మీనాయన గారు పట్టణ మంతయు విడిచి, యీయేటియీవలికాఁపుర మెందులకుఁ బెట్టిరో కాని- ప్రతిదినము వచ్చి పోవు మావంటివాండ్రకుఁ బహు కష్టముగా నున్నది! అంత గొంతు బద్దలగునట్లుఅవఁగా నఅవఁగాఁ బడవవాఁ డేకల్లు పాకలోనుండియో యూడిపడి యీవల బడవేసినాఁడు. కాని, యేమిలాభము!- దాని తల్లిబొడ్డు పొక్కిన దుశ్శకునఫలము దయ్యమువలె నిచ్చట మరలఁ బ్రత్యక్ష మయినది!

బిల్వ—అదెట్లు ?

దామో—ఎట్లేమిటి ?-వినవలసిన పురాణము కొంత వికలమైపోయినది కాదా !

బిల్వ—మిత్రమా ! నీవు వినవలసిన దేమియు మించిపో లేదు. ఇంకను నిన్నటి పతివ్రతాధర్మ ఘట్టములోనే యున్నాము.

దామో—అదిగో అవియే నాకు ముఖ్యముగాఁ గావలసినవి! అవి మించిపోయినందులకే నే నింత యాకులపడుచున్నది !

బిల్వ—మిత్రమా ! నీవు పురుషుఁడవు కదా ? – పతివ్రతాధర్మముల పట్ల నీ కింత పామర మెందులకు ?

దామో—వెఱ్ఱివాఁడా ? నానిమిత్త మనుకొంటివా ? నాభార్య కుపదేశించునిమిత్తము ప్రపంచములో ధర్మము లెవరు విన్నను బరులకుఁ జెప్పుటకే కదా ?

బిల్వ—చక్కఁగాఁ జెప్పితివి !

క. ఇతరులకు మందుఁ దెలుపఁగఁ
బ్రతివాఁడును వైద్యశాస్త్ర • పరిపూర్ణుండే !
యితరులకు నీతిఁ గఱపఁగఁ
బ్రతివాఁడును నీతిశాస్త్ర • పారంగతుఁడే !

దామో—అమ్మాయీ ! మీయాయన చిలుకపలుకు లావల వినవచ్చును గాని- పురాణము కానిమ్ము.

రాధ—ఇదిగో చదువుచున్నాను- (అని పుస్తక మెత్తి పఠించును.)

"క. ధని, యధనుఁడు ; రూపసి, యా
ప్పనివాఁడు ; వివేకి, మూఢ • భావుఁ ; డరోగుం,
డనుగతరోగుఁ ; డనక యం
గన పతిఁ బాటింపవలయుఁ • గామధ్వంసీ !,,

దామో—వహ్వా! వహ్వా! వరహాల కెత్తున కెత్తైన పద్యము ! మిత్రమ! తరువాత మెల్లఁగా వల్లెవేసెదఁ గాని—అరటిపం డొలిచినట్లు దీని యర్థ మంతయు విడఁదీసి చెప్పుము.

బిల్వ— భర్త ధనవంతుఁడు కానిమ్ము, దరిద్రుఁడు కానిమ్ము- రూపవంతుఁడు కానిమ్ము, కురూపి కానిమ్ము- ఆరోగ్యవంతుఁడు కానిమ్ము, రోగి కానిమ్ము- భార్య యతనిని భక్తితో సేవింపవలె నని దీనిభావము.

దామో.—ఓహోహో! మహానుభావుఁడు కవిబ్రహ్మ యేమిపద్యము చెప్పినాఁడోయి! ఇప్పు డతఁడు బ్రతికి యున్నచోఁ బడతీసి పట్టెడు పంచదార నోటఁ గూరక పోదునా! ఈపద్యము వినిపించితినా- మాయింటిదాసి నోరు మఱి లేవదు! మాయింటియెదుటి వేసారి పంతుల మూఁడవపెండ్లి పెండ్లాము-కంటె, కాసులపేరు-అవేమో వానిపేరులు నాకు రావు- మీఁదినుండి క్రిందివఱకు నేమేమో తగిలించుకొని బుర్రాకిబొమ్మలాగున గుమ్మములో నిలుచుండునపుడెల్ల మాపాడగట్ట నా కాపిల్లను జూపి, తనకు నే నాలాగున దిగఁబోయ లేకపోతి నని యనెడుమాటలు- ఆముక్కు విఱుపులు- ఆమూతివిఱుపులు-ఆరోసరోసలు ఆవిసవిసలు-ఏమని చెప్పుదును! ఆపైని నాకన్నులు గుంటకన్ను లఁట! నాముక్కు బొఱ్ఱముక్కట! నాదవడలు చప్పిదవడ లఁట! నేను దగ్గఱకు వచ్చిన పాడు ముకం నఁట! – మాటాడిన తుంపర తుపా నఁట! నారూపము చూచి తాను బెండ్లినాఁడే యసహ్యపడిన దఁట! పల్లకిలోఁ దల వంచుకొని కూరుచున్నది పదిపాళ్ళందులకే యఁట! భర్త యెంత కురూపి యైనను భార్య యతనికాళ్లు కడిగి నెత్తిని జల్లుకొని తీఱవలసిన దని పురాణము లిట్లు ఘోషించుచుండ-దాని కింత యజ్ఞాన మేమో తప్పక యిప్పుడు తేలవలెను!

రాధ— అన్నా! మావదెన చక్కఁగాఁ జదువుకొనినది కదా!

దామో— అదే వచ్చినచిక్కు! అందువల్లనే దాని కింత యదరిపాటు! అయిన, నిప్పటియాఁడంగు లాఁడంగులు కారు! మర్యాదలు మాసిపోయినవి-కట్టుబాటులు కాలిపోయినవి, యెగ్గుసిగ్గు లేటఁ గలిసినవి- పనిపాటలు పదటఁ గలిసినవి; పనికిమాలిన వేషములు-పట్టు

రాని రోషములు ; రచ్చల కెక్కి రాద్ధాంతములు-సీమలు దాటి సిద్ధాంతములు ! ఇంత యేల-ఇఁకఁ గొంతకాల మిట్లు నడచినచో- మగవారినోట మన్నే !

తెరలో—అబ్బాయి !- బిల్వమంగళా !

బిల్వ—(ఉలికిపాటుతో) నాయనగా రెందులకో పిలుచుచున్నారు ! (బిగ్గఱగా) అయ్యా ! వచ్చుచున్నాను. (అని దిగ్గన లేచి వెళ్లును)

రాధ—ఎందులకో మామగారు స్వయముగా వచ్చి పిలిచినారు !

దామో—ఎందులకా ?—మనపురాణము మంటఁ గలుపుటకు ! ఇదం తయు నిందాఁకటి నా శకునమాహాత్మ్యమే !

క. చెడుశకునము, చెడుకలయును
జెడుహాయమును, జెడుగ్రహంబుఁ • జెడుస్నేహంబుఁ
జెడుపాత్రము, నిజముగఁ దమ
చెడుతనముం జూపకుండఁ • జెందవు తృప్తిన్.

రాధ—(వినుట నభినయించి) అరుగో !-వచ్చుచున్నారు లెమ్ము.

బిల్వ—(ప్రవేశించి) ప్రియురాలా ! యీపూఁటకుఁ బురాణము నిలిపి వేసి నాకు దుస్తులు తీసి యిమ్ము. నేను శీఘ్రముగాఁ గార్యస్థాన మునకుఁ బోవలెను.

దామో—అయ్యో దేవుఁడా ! ప్రొద్దు ప్రాలలేదు-భోజనాయాసము తీఱలేదు- అప్పుడే యేమి తొందరపని యాసన్న మయినది ?

బిల్వ—మఱేమియు లేదు ; నాయనగారు నేఁటినుండీ వ్యాపార మంత యుఁ బ్రత్యేకము నామీఁద విడిచిపెట్టి తాము విశ్రాంతి గైకొన నిశ్చయించుకొన్నారు. అందులకై, ముందు వర్జ్యమున్నందున వెం టనే బట్టలు వేసికొని కార్యస్థానమునకు రమ్మని యాజ్ఞాపించినారు.

రాధ—అట్లయిన మీకుఁ గార్యభార మధికమై యాయాసము కలి గించు నేమో కదా ?

బిల్వ—నాకును నదేభయము కలదు కాని- తండ్రిగారికి విశ్రాంతి కలి గించు నిమిత్తము తల యొగ్గఁ దలఁచుకొన్నాను. చూడు,

ఉ. ప్రాయము వచ్చినంత గృహాంభారము మూఁపునఁ దాల్చి తండ్రికిన్
హాయిగఁ గూరుచుంట కను • వైన విరామ మెవండు సేకురం
జేయునొ వాఁడె పుత్త్రుఁడని • చెప్పఁగఁ జెల్లును ; వార్ధకంబునన్
స్వీయ తనూభవప్రతతి • చేత సపర్యలు గాంచు నాతఁడే.

దామో—(దిగ్గన లేచి) అట్లయినఁ జిన్ననాఁడు మా నాయనగారికి నేను గావలసినంత విశ్రాంతి కలిగించినాను. ఎట్లందువా ?– ఆయన పాదుముకుండ్లు పగులఁగొట్టి స్వయముగాఁ బోడుము చేసికొను నవస్థ నివారించినాను ; కొల్లాయగుడ్డలు గోచులక్రిందఁ జించుకొని పూఁటపూఁటకు వానిని పులిమికొనుశ్రమ తొలఁగించినాను; పంచాంగములు చించి గాలిపటములు కట్టి ప్రతివారికి మునాూర్తములు పెట్టుబాధ తప్పించినాను. సరి కాని,

గీ. వెలవెలందిని మరగి దు • ర్వృత్తుఁడు తనదు
ధర్మపత్నిని రోయు వి • ధంబుగాను ;
సంతతంబును వ్యాపార • చింతఁ దగిలి
మన పురాణప్రమేయమే • మఱచె దేమొ ?

బిల్వ—ఎంతమాట ! ఎన్ని కార్యములు మీఁదఁబడినను మనగోష్ఠి కెన్నఁడును భంగము రానీయను.

ఉ. కమ్మరపుర్వు పంకమునఁ • గ్రుమ్మరుచు న్మలినంబు మేన లే
శమ్మును నంటకుండఁ జను • చాడ్పున– లౌకికవృత్తులందు ని
త్యమ్ము జరించుచుండియు హృ • దంతరమందుఁ దదీయవాసనల్
క్రమ్ముకొనంగనీయమియ • కాదె వివేక మనంగ ? మిత్రమా !

కాని– యీగోష్ఠి మన మిఁక రాత్రులకు మార్చుకొనవలెను.

దామో—అట్లయిన నాకు మఱియు సంతోషము– నడువుము

(అందఱు నిష్క్రమింతురు.)

ఇది ప్రథమాంకము.




# ద్వితీయాంకము

—(౧)—

రంగము :—చింతామణి సౌధము

(శ్రీహరి చింతామణులు ప్రవేశింతురు.)

శ్రీహ—సరికాని— నామాట నీ కింత నాటకున్న దేమి ?

చింతా—ఏమాట ?

శ్రీహ— ఈభవానీశంకరు నింతటితో సడ్చివేయవలసిన దని యెన్ని సారులు చెప్పినాను ?

చింతా—అవునుగాని— అంతసొమ్ము పెట్టినవాని నింతలోనే యావలకుఁ గొట్టలేక చూచుచున్నానమ్మా ? చూడు—

సీ. వగలును వలపులు • వర్ణించి తొలినాఁడె
తిరుగనిపిచ్చి యె • త్తించినాను
వచ్చిన నెలలోనె • మచ్చికమీఱ లా
లించి మాన్యమ్ము ల • మ్మించినాను
బన్నసరాలకై • పట్టుపుట్టములకై
యిల్లు విక్రయము చే • యించినాను
దినవెచ్చముల కని • తినుబండముల కని
పెండ్లాము నగలు మా • ర్పించినాను
అన్నివగలు చూపి • యిన్నిరీతుల మాపి
యెట్టు లింతలోనె • యేఁగు మందు ?
ఆతఁ డుస్సు రన్న • నాతనికడఁ గొన్న
ద్రవ్య మెట్లు మనకు • దక్కునమ్మ !

శ్రీహ—ఇదిగో యిదియే నీ దగ్గఱనున్నలోటు ! ఈశ్రీరంగనీతులే నిన్నుఁ జెఱచుచున్నవి ! నీయందమునకు నీచందమునకు నీవిద్యకు నీతెలివికి ఈలోటు లేనియెడల నీపాటికి కోట్లు గడింపకపోదువా ?

గీ. విత్త మున్నంతవఱకును • విటుని ఘనము
కోరి నెత్తిపై నెక్కించు • కొనఁగ వలయు ;
విత్త మడఁగినతోడనె • బిడియ మడఁగి
కుక్కనుంబోలె బయటికిఁ • గొట్టవలయు.

చింతా—అమ్మా ! నీకాలములో నీ వట్లే చేసితివా ?

శ్రీహ—నేనా !-నామాట చెప్ప మనెదవా ?

సీ. కడులోభి యైనను • కరఁగించి క్షణములో
కొసరి వందలు వేలు • గుంజినాను
పులివంటివాఁ డైనఁ • బూఁటలోఁ గుక్కను
గావించి వాకిటఁ • గట్టినాను
కోటీశ్వరుం డైనఁ • గుమ్మములోనఁ గా
లిడ పక్కీరునిఁ జేసి • విడిచినాను
పరమనైష్ఠికుఁ డైనఁ • బడదీసి నోటను
బెట్టి యెంగిలి తిని • పించినాను
పయిక మున్నంతవఱకును • ప్రతినిమిషము
వలపు గురిపించి, పయికము • వట్టిపోయి
నంతనే కంతుఁ డేని యొ • కింత యైన
నెనరు చూపక మెడఁ బట్టి • నెట్టినాను.

చింతా—మొత్తముమీఁద నేనుమాత్రము నీకుఁ దీసిపోయిన దే మున్నది కాని— అమ్మా ! నేను పెద్దదాన నగుసరికి మనయింటఁ బూతికపుల్లయైన లేదు గదా- ఆ గడించిన దంతయు నేమి చేసితివి ?

శ్రీహ—అదిగో అదే నావల్ల జరిగిన పొరపాటు ! ఒకప్పుడు నా కొక పిసినిగొట్టు పీనుఁగు దాపుర మయినాఁడు. వానియొద్దనుండి పయికము లాగుటకై వానికి త్రాగుడు నేర్పవలసి వచ్చినది.-వాని

నేర్పుటకై వానితోపాటు నేనుగూడ త్రాగవలసి వచ్చినది. చివ రకు వాఁడు వదలినను- వానికొఱకు నేర్చుకొన్న త్రాగుడు వదలి నది కాదు. అందువల్ల సంపాదించిన దంతయు సారాత్రిత్తులకు స మర్పింప వలసినదాన నయితిని!

చింతా—వయసులో నెంతగడించినను వార్ధకము వచ్చుసరికి కూడు గుడ్డ లుండరా దని మనకులమునకు శాప మున్నదఁట కాదా?

శ్రీహ—ఆశాప మిప్పు డమలులో లేదు. పూర్వపు విటులు వయసు మళ్ళిన వారకాంతను- వాడిన పూవునుంబలె- మూచూచెడివారు కారు, ఇప్పటివారు- చివికిన యావకాయ పేడునుంబలె- చివరి వఱకు విడుచుట లేదు. అందువల్ల నాశాపమున కిప్పుడు పటిమ పోయినదన్నమాట. దీని కేమి కాని- యాపీనుఁ గేమయినాఁడు?

చింతా—ఎవరినో అప్పడిగినాఁడఁట- వా రీపూఁటఁ దప్పక యిచ్చెద మని వాగ్దానము చేసినారఁట- అందులకై వెళ్లినాఁడు.

శ్రీహ—ఈపట్టణములో నీపాడుమొగమున కప్పిచ్చుట కింకను మిగిలిన వా రెవ్వరు దేవుఁడా! వట్టిది వట్టిది- నేను నమ్మను. తేఁగలిగిన చోట నెల్ల నిదివఱకే తెచ్చినాఁడు. ఈయూర నితని కప్పిచ్చువా రిఁక నెవ్వరును లేరు. ఇవి యన్నియు నిన్ను బుట్టలోఁ బెట్టుటకు పన్ను బూటకములు. అయినను, సెనగలు తిని చేయి కడుగుకొని నట్లు ఋణములమీఁద సాతాళించి సాగనంపవలసినదే కాని- యిన్ని దినము లొకనితో సరస మేమిటి!

చ. దినమున కొక్కనిం దెలివి ♦ తేటలతోడను గోచిపాతరా
యనిగ నొనర్చి; వేఱొకని ♦ కాతని స్థాన మొసంగి; యింక నొ
క్కని కది మాటయిచ్చి,మఱొ♦కానొక జారునిఁగూర్చి యచ్చులొ
గ్గిన నెరజాణయే గణిక! ♦ కీరితిఁ గాంచుఁ గులంబునం దదే.

అదికాక—

చ. పడవుఁబడంతికి న్వయసె ♦ ప్రాణము, ప్రాయపు టందచందముల్
కడచినఁ బీనుఁగుం గనిన ♦ కైవడిఁ జూతురు; కాన, భోగినుల్

పడుచుతనంబునందె తను • ప్రజ్ఞ బయల్పడ రెండుచేతులం
గడన మొనర్పఁగా వలయు • గాలము లై విట మీనకోటికిన్.

చింతా—అమ్మా! యీచదు వంతయు నాకుఁ జిన్ననాఁడే నేర్పితివి కదా – యిప్పుడు మరలఁ బారాయణ మెందులకే?

శ్రీహ.—ఎందులకా?– నీవు వట్టి వెఱ్ఱిబాగులదానవు. నాకడుపునఁ బుట్టితి వన్నమాటయే కాని– నాగుణ మొక్కటియుఁ బట్టుపడినది కాదు. అందువల్ల, నాప్రాణము హరీ యనువఱకును నీకొఱకిట్లు నిత్యము ప్రాకులాడక తప్పదు. చూడు,

గీ. చెఱకు రసమెల్లఁ బీలిచి • చెత్త యవలఁ
బాఱవైచెడు చందానఁ • బడపుఁగత్తె
విటునిసర్వస్వముం బిండి • పిప్పి యైన
వెంటనే యవ్వలకుఁ గొట్టి • వేయవలయు.

కాఁబట్టి, నామాట విని, వీని కింతటితో బుఱ్ఱగోకుడు పెట్టి సాగనంపు. లేదా–నాకు విడిచిపెట్టి నా మహిమ చూడు–క్షణములో శంకరగిరి మన్యములు పట్టించెదను!

చింతా—అమ్మా! నీశక్తి నే నెఱుఁగుదును గాని– నేఁడో రేపో నేనే చెప్పెద నీ వూరకుండుము.

శ్రీహ—అట్లయిన సరిమె—యిఁక నేను క్రిందికి వెళ్ళెదను, (అని రెండడుగులు వేసి) అన్నట్లు ముఖ్యముగాఁ జెప్పవచ్చినమాట చెప్పనే లేదు! (అని మరల వెనుకకు వచ్చి) పెద్దిసెట్టికొడుకు మనవీథి నీపూఁట మూఁడు నాలుగు సారులు తారులాడినాఁడు. ప్రతిసారియు నతనికన్నులు మనయింటిమీఁదనే యున్నవి. చూడు–

గీ. వలపురోగంబు పుట్టని • వాఁడు సాని
వాడకే రాఁడు; వచ్చెఁబో • వారియింటి
వంకఁ గన్నెత్తి చూడఁ; డె • • వ్వాఁడు చూచు
వాఁడు మనయింట బంటగు • వాఁడె సుమ్మ.

అదిగాక- అతఁడీమధ్య తం|డికన్నులలో కారము చల్లి, కాసులకు కాసులు తెచ్చి కర్చుపెట్టుచున్నాఁడని కూడ విన్నాను. ఇంత యేల- ఖామధ్య రంగనాయకికి పట్టిన సడుమంతరపుసిరి యంతయు నతనివల్లనే యఁట!

చింతా—ఆసంగతి వినియే- మొన్నటి పెండ్లిమేజువాణీలో నా కతఁడు వసూలుతాంబూల మిచ్చునప్పుడు రవంత రంగుచేసినాను. ఈతారులాట దానిఫలితమే కావలెను.

|శీహ—మేళముల |ప్రయోజనము చూచితివా! ఇంతగా దిఁకనూరింతలు గడించినను- చక్రవర్తి|ప్రాపకము సం|ప్రాప్తమయినను- మనము మేళములు మానరాదని నేను మొత్తుకొనుట యిందులకే.

సీ. ఊరూరునకును సం • చారంబు సలుపుచు
పదిమంది కంటను • బడఁగ వచ్చు
ముస్తాబు మఱుగున • ముదిలంజెయును లేఁత
పిందివోలెను గాని • పింప వచ్చు
కోడిగ మాడియో • కొంగు తాఁకించియో
|క్రొత్త వారికి మరుల్ • కొలుప వచ్చు
ఉంచుకొన్నాతని • యులుకు లేకుండఁగ
కొల్లగా నార్జించు • కొనఁగ వచ్చు
ఇంత యేటికి ?- వినుము ! కా • సింతపాటి
తెలివి తేటలు కలవేని • దేవునైన
వెంటఁ గుక్కను వోలెర • ప్పింప వచ్చు !
వేశ్యలకు మేళమే పది • వేలు సుమ్ము.

చింతా—(తనలో) సందేహ మేమి!- విటశలభములను భస్మీకరించుటకు మేళములు కారుచిచ్చులే !

గీ. మిడుత కార్చిచ్చు నారసి • మిడిసిపడుచు
వచ్చి, చొచ్చి, నశించెడి • మచ్చుగాను ;
విటుఁడు మేళంబులో వేశ్య • వేష మరసి
|భ్రమసి, తగులుదువడి, చెడి • సమసిపోవు !

ఈవిధముగా నిప్పటికి నాచేత మూడిపోయిన మగమిడుతలెన్ని యుండునో! (పయికి) అమ్మా! నీవు చెప్పినది నిజమే. అది కాక-యిప్పుడు మొగ్గలబేరమొకటి మోపుగా నున్నది! ఈసుబ్బిసెట్టి మొన్న, అఱగంటలో నా కాఱుకాసు లర్పించినాఁడు!

శ్రీహ—సరి, యిఁక నేమి! అట్లయిన రుచి తగిలిన దన్న మాటయే! ఈసారి యిటువచ్చినప్పుడు నీకుఁ దెలియఁజేసెద - నీవు డాబామీఁదినుండి తప్పక యొకసారి కనఁబడుము. ఊరక కనఁబడిన నుపయోగము లేదు సుమా!-

గీ. తళుకుచు తళుకు మనుచును • తారవలయు,
నగుచు వాల్చూపు లెడఁదను • నాటవలయు,
దగ్గి సకిలించి వెనుకకు • తగ్గవలయు;
నిటుల నాకర్షణము సేయు • కిటుకు లివ్వి.

చింతా—ఈసంగతులు నాకిపుడు క్రొత్తగా నేర్పఁ బని లేదు కాని-తనతండ్రి మనయింటికి వచ్చుచుండుట యాతఁ డెఱుఁగకుండునా?

శ్రీహ—ఎఱిఁగిన నేమి- యెఱుఁగకున్న నేమి; ఆభేదము మన కెన్నఁడును లేదు: ఆ యెగ్గుసిగ్గు లిప్పుడు మనతోపాటు మనయిండ్లకు వచ్చువారికిఁ గూడ పోయినవి! (వినుట నభినయించి) ఎవరు చెప్పుమా వచ్చుచున్నారు? చిత్రకాదుగద? (చూచి) అదిగో అదియే.

చిత్ర—(ప్రవేశించి) అమ్మా! యెవరో సుబ్బిసెట్టిగారంట- పెద్దిసెట్టిగారి కొడుకంట- లోపల కొచ్చి- అక్క య్యేంచేస్తోందని అడిగారు. మేడమీదున్నాదని సెప్పాను. ఆమట్టున-అదేంటి సెప్మా?-

శ్రీహ—సరే తెలిసినదిలెమ్ము. నీనోటినుండి మాట యూడిపడుసరికి ఊరు మాటుమడఁగును! అమ్మాయి! పట్టఁదలఁచిన చేప పయికే తేలినది! చిత్రా! నీవు వెళ్ళి- కాదు కాదు, నీవుండు- నేనే పోయి నెట్టుకొని వచ్చెద. (అని నిష్క్రమించును.)

చింతా—(తనలో) అయ్యో దేవుఁడా! యీమిడుత కాయ యింతలో నే మూఁడినదే! అయిన, సతనిత ప్పేమున్నది!

చ. పడపుఁబడంతి కంటఁబడ • భావమునం దృటిలో వికార మొ
క్కఁడు ప్రభవించి తుత్తుమురు • గా నొసరించు వివేకవల్లికన్
పడుచుతనంపుఁ దిమ్మిరియుఁ • బైకపు మైకముఁ గూడి యవ్వలన్
నడు నడు మంచు దాని నద • నంబునకు న్మెడఁబట్టి నెట్టెడున్.

(నయికి) చిత్రా! వసారాలోని కుర్చీలు రెండు తెచ్చియిచ్చట వేయుము; ఆకులు పోకలు పళ్ళెరములో వేసి, అత్తరుదానుతో బల్లపై నుంచుము. అలమారులోని యగరువత్తులు నాలుగు తీసి వెండిచెట్టున గ్రుచ్చి వెలిగింపుము—తెలిసినదా?

చిత్ర— తెల్సింది, తెల్సింది (అని యాపనిమీఁదఁ జనును.)

చింతా—ఛీ! పాడువృత్తి యేమివృత్తి యిది!

ఆ. ఎఱుఁగవలయు విటుని • యెడఁద సొంతముగ; స
హింపవలయు వాని • యేహ్య మెల్ల;
మనలవలయు నతని • మదికెక్కన; ట్లూడి
పడునె యపుడు గాక • పైక మురక!

(అని నిలువుటద్దముకడకుఁ బోయి పాపట దిద్దుకొని, పావడ నవరించుకొని, అత్తరు రాచికొని, గదిగుమ్మముకడ నిలుచును.)

శ్రీహ—(సుబ్బిసెట్టితో మరలఁ బ్రవేశించి) అమ్మి! సుబ్బిసెట్టిగారు సుబ్బిసెట్టిగా రని యాకేరీతిఁ బలువరించితివి. ఇరుగో నీ సుబ్బిసెట్టిగారు. బాబు! ఏమి చెప్పుదును!—మొన్న మేజువాణీ కచేరీలో మిమ్ముఁ జూచిన దఁట—అది మొదలు రేబవళ్ళు మీధ్యానమే.

సుబ్బి—(వెకిలినవ్వుతో) అబ్బో! అబ్బో! నిసంగా!—నాతోడే?

శ్రీహ—మీతోడు బాబు! మిమ్ములను చంపుకొని తిన్నట్లు! పెద్దముండను—మీతో పెడేలున నబద్ధ మాడుదునా? అయినను; మీకా యనుమాన మెందులకు?—

కం. మీయందము, మీ చందము,
మీ యైశ్వర్యానుభూతి • మీ చతురతయున్

మీ యీవియుఁ బరికించిన
నేయింతి మిము స్వరింప • దీక్షితిలోనకా?

సుబ్బి—అబ్బో ! అబ్బో ! అల్లాగైతే నే నిల్లుబయిదెల్లినేళ మంచిది! తోక లొటలొట లాడిస్తూ దోరకు క్కెదురుగా వొచ్చింది! అన్నట్టు ఠక్కమా ఔందుకూ- యియ్యాళ మంచం దిగుతూ మా అత్తప్ప మొహం సూశాను ! యదవదైనా-దాని మొహం సూస్తే యేదో లాబం తగిలిం దన్నమాటే !

శ్రీహ—మీమాట కేమి కాని- మాయమ్మ యీప్రొద్దేదో మంచి మొగమే చూచినది. కాకున్న మీరు వచ్చుట తటస్థింపదు. లో పలికి రమ్మన వేమే ?— ఇన్నాళ్ళకు వచ్చినా రని కోపమా యేమి?

చింతా—నా కేమి కోపము !-రంగనాయకి యిల్లు విడిచి రమ్మనినమాత్ర మాయన వత్తురా !

శ్రీహ—చీ ! చీ ! అదేమే అట్లనెదవు ! పాడురంగనాయకి !-రంగనా యకియింట నాయనమెత్తు రత్నములు పోసిన నడుగు పెట్టుదురా! రూపమునకా : మన్మథుఁడు-భాగ్యమునకా : కుబేరుఁడు-ఈవికా కర్ణుఁడు-ఈయనకు రంగనాయకియిల్లు కర్మమేమి ! ఏమి బాబు ! మాటాడ రేమి?- అంతేనా ?

సుబ్బి—అంతే, అంతే ! అమ్మత్తోడు! అబద్ధమెందుకు- యెవరోయీ డ్చికెత్తే యే డెనిమిదిసార్లు కాఁవో సెల్లేను. అయితే అత్తమ్మా తెల కడుగుతాను- దానింటి కెల్లటం తప్పే అంటావా ?

శ్రీహ—తప్పా- తప్పున్నరా ! మీదర్జా యెక్కడ- మీపో కెక్కడ- రాలుగాయముండ-రంగనాయకి యెక్కడ ! మీవంటివా రటువం టిదానిగుమ్మము త్రొక్కవచ్చునా ?

చింతా—అమ్మా ! నీకు వెఱ్ఱియామేమి ? రంగనాయకిని విడిచి యా యన రవంతసే పుండఁగలరా?

సుబ్బి—ఇదుగో!- యీమాటినుః యిహ దాని గుమ్మం తొక్కినట్టు తెలిస్తే- కాండ్రకించి కళ్ళొపులాగ మొహాన్ను య్యి !-సరేనా ?

శ్రీహ—అబ్బా ! యెందుల కంతమాట ! అయితే—బాబు !— మనకు
నల్లమందువ్యాపార మేమియు లేదు గద ?
సుబ్బి—మనకు లేదుగాని—మనత్తోరికుంది. యేఁవైనాకావాలాయేటి ?
శ్రీహ—అయ్యో ! కావలెనాయని మెల్లఁగా అడిగెదరా ! పూఁటకు
తులము పూర్తిగ కావలెను !
సుబ్బి—అయితే యీ రేతిరి జేగర్తపెట్టి రేపు తాటికాయంత ము
ద్దంపుతాను సలిఁవిడీ మింగినట్టు నల్లగా దిగమింగు. సరేనా ?—
శ్రీహ—మంచిది బాబు ! మంచిది— జేబులో చుట్టమున్నదా ?
సుబ్బి—నాకు సుట్టబ్బేసం లేదు. డబ్బిస్తా కొనుక్కుంటావా ?
శ్రీహ—వలదు బాబు ! వలదు— మీ రత్నాల చేతిగుండ రాగిడబ్బు
పుచ్చుకొనుట నా కిష్టము లేదు.
సుబ్బి—పోనీ— రూపా యిస్తా పుచ్చుకో! (అని తీసి యిచ్చును.)
శ్రీహ—అమ్మ ! చూచితివి కదా— అయ్య దర్జా! (అని కన్ను గీటి)
బాబు ! నా కిఁక సెలవు (అని నిష్క్రమించును.)
చింతా—మాయమ్మ యున్నదని మనసున సందేహించి యూరకుండ—
అక్కడినుండి యడుగు కదల్ప లేమి ? (అని చేయి పట్టి లాగును.)
సుబ్బి—(పారవశ్యముతోఁ దనలో) వవ్వా ! వవ్వా ! యేఁవిసుకం!
యేఁవిసుకం !—వొళ్ళు తగిలేసరికి— తాఁవరమీ దుడుకునీళ్ళోసుకు
న్నట్టు— కళ్ళు మూసుకుపోతున్నాయి ! ఓరయ్యల్లో ! యిది
సుకాలపుట్టకాని—సామాన్నెంసాని కాదన్జో ! (అంతలోనులికిపడి)
వుండుండు ! వొక్కమా టొక్కమాట ! అమ్మతోడు ! లోవ
లేదో సప్పుడయింది— యెవరో వున్నట్టున్నారు ! (అని వడకును)
చింతా—(నవ్వుచు) మీ రంగనాయకి !
సుబ్బి—(ఊఁడిగిలఁబడుచు) అయ్యల్లో ! కొంప మునిగింది ! దా న్నిం
టో దాసి, తాళఁవేస్తోన్నట్టు తెలక— నోటికొచ్చినట్టు పేలేశాన్రా
దేవుఁడా ! ఓలత్తప్పో !—నీమొహం మొద్దులు కానో !—యెవారఁ
విల్లా యెల్లికిలబడా దేఁవే !—

చింతా—(పకపక నవ్వుచుఁ దనలో) రామరామ! వీఁడు వట్టి వెఱ్ఱి వెంకటాయ! ఇటువంటివాజెమ్మ లందఱు విటు లగునప్పుడు వేశ్యల కేమి లోటు! (పయికి) భయపడకయ్యా! రంగనాయకి కాదు! మాచిత్ర లోపల నేమో సర్దుచున్నది. చిత్రా! నీపని యైనది కాఁబోలు నిఁక వెళ్ళుము.

చిత్ర—(లోపలినుండి వచ్చి వెకిలినవ్వుతో) మాయక్క పక్క న్నుంచుంటే-మాబావగారి మొహాని కెంతెలు గొచ్చిందో!(అనినిష్క్ర)

సుబ్బి—(సంతోషముతో) అబ్బో! అబ్బో! నామొహానికే! అన్నా! అద్దఁవుంటే యెగా దిగా సూసుకుందును గందా?

చింతా—గదిలో కావలసినన్ని యద్దము లున్నవి రండు. (అని తీసికొనిపోయి) మీరంగనాయకి చక్కనిదా?- మాచిత్ర చక్కనిదా?

సుబ్బి—రంగనాయకి మనసిత్తర కాలిగోరుమీద బలాదూరు!

చింతా—అట్టిదానియింటి కెందులకు వెళ్ళినారు?

సుబ్బి—బుద్ది గడ్డి తిని! సెప్పుకుంటే సిగ్గు!-నువ్వు-నువ్వ నేకాని-వొఖమా టయినా మీ రనలేదు సుఁవా! మీ మరేద సూస్తే కడుపు నిండిపోయి-కళ్లంట నీ ళ్లొస్తున్నాయి!

చింతా—(తనలో) పాపము! ఈమర్యాద యెంతసేపో-యెఱుఁగఁడు! (పయికి) పెంపుడుముండ-మర్యాదసంగతి దాని కేమి తెలియును!

సుబ్బి—పెంపుడుముం డనఁగా?

చింతా—అనఁగానా? మాజాతి కిపుడు సంతానయోగము తగ్గిపోయినది. అందువల్ల-

గీ. హద్దు చెడి కని పొట్టకై • యమ్ముకొనెడి
సాలె, యుప్పర, యానాది • చాకి, పాకి
యీండ్ర, జేండ్ర పిల్లలఁ గొని • యిందువదన
చంద్రవదనలఁ గావింత్రు • సాను లిపుడు.

ఆకారణముచేత,

గీ. ఆటపాటలు చచ్చె, దు • రాశ హెచ్చె,
వినయము నశించె, దుర్నీతి • విస్తరించె,

కట్టుబాటులు మాతెె, సం • కరము మీతెె,
కాకులం బయ్యె నిటు గణి • కాకులంబు.

సుబ్బి—అయితే నుఠీ-ఆళ్ల కేం గిడుతుంది ?

చింతా—గిట్టకేమి !-వాంఛ్రపనియే యిప్పుడు వాటముగా నున్నది !

సీ. మెరికవీథిని బెద్ద • మేడ కట్టిన చిట్టి
సంతలోఁ గొన్నట్టి • చాకిముండ

సుబ్బి—అల్లాగా ! అందుకనే- ముండ దగ్గిర కొస్తే మురికోసన !

చింతా—మీసందు చివరను మిద్దెలో నివసించు
వనజాక్షి కూఁతురు • వాడముండ

సుబ్బి—అదుగదీ ! అందుకే సెత్తముండ దగ్గిర కొస్తే సేపలకంపు!

చింతా—బండిమీఁదను గాని • బయటికి రాని యా
నగరాజతనయ యా • నాదిముండ

సుబ్బి—యేంటీ ! అందుకనే సెండాలమ్ముండ జేబుల్తడుఁవుతుంది !

చింతా—నాల్గుదివాణముల్ • నట్టేటఁ గలిపిన
యిందీవరిక యాఁక • యింౘ్రముండ

సుబ్బి—సీ ! సీ ! సీ ! అందుకనే కానిముండ దగ్గిరకొస్తే కల్లుకంపు !

చింతా—పుడమి దైవికముగ పడి • మొలచినట్టి
మొక్క పెనువృక్ష మగునట్లు • మూఁడుపాళ్లు
పయికొలంబులనుండి సం • ప్రాప్త మయిన
వారె పెదసాను లగుచున్న • వారు నేఁడు ?

సుబ్బి—పోనీ-మంచిపిల్లల్నే పెంచుకోరాదూ ?

చింతా—మంచిపిల్లలు మా కెట్లు దొరకుదురు ? అది కాక - బాపన పిల్ల, రాచపిల్ల, గొల్లపిల్లలు, దొరకినను పెంచుకొనము.

సుబ్బి—అదేఁవీ ?

చింతా—బాపనపిల్ల యాచారవంతురా లగును ; రాచపిల్ల పౌరుష వంతురా లగును ; గొల్లపిల్ల వెఱ్ఱిబాగులది యగును ; ఈమూఁడు ను బడఁపుప్రవృత్తికిఁ బనికిరానివే.

సుబ్బి—కోఁవటిపిల్లను పెంచుకుంటారా ?

చింతా—(తనలో) నయమే! కోఁతిపిల్లను బెంచుకొందురా యని య డుగ లేదు! (పయికి) కన్నులలోఁ బెట్టుకొని పెంచుకొందుము.

సుబ్బి—అయితే, నా కాడపిల్ల పుట్టినా నీ కిస్తాను.

చింతా—(తనలో) నీవేమో వెలుగుగొడ్డుకంటె వేయిరెట్లు చక్క నివాఁడవు! నీభార్యయేమో రక్కసి బొగ్గులలో రామచిలుక! మీయిరువురకుఁ బుట్టినపిల్లను బెంచుకొనినచో మాయదృష్ట మడుగ నా! (పయికి) పోనిండు ఈయకపోయినను ఇచ్చినంతమాటన్నా రు- కూర్చుండ రేమి! (అని కుర్చీమీఁద కూలదీయును.)

సుబ్బి—నువ్వో మఱి ? నువ్వుకూడా కూకుంటేగాని నాపాసం వోరు స్తుందా! (అని వ్రేళ్లయుంగరములు లగపడునట్లభినయించును.)

చింతా—(తనలో) నీనియభినయము కాల! వ్రేళ్ళయుంగరములు నా కగపడవలె నని వచ్చినదిమొద లీకేయభినయము!- క్రొత్తసాని కడకుఁ బోవునపుడు కోడెగాండ్రకుఁ బుట్టుపుండ్లలో నిది యొకటి!

ఉ. రాగము తీయఁబూనుట! స ♦ రాగము లాడుట! మేనిసొమ్ము లే లాగుననైన సాని కను ♦ లం బడఁజేయుట! డాబు లూరకే వాగుట! చప్పుడొకరణి ♦ పైకము తట్టుట! భోగి పోలిక త్యాగివలె న్నటించుట! వి ♦ టావలి చేష్టలు క్రొత్తచోటులన్!

(పయికి) కూర్చుండుట కేమి కాని- సెట్టిగారు! కలిమిలో లోటులేనివారుగదా-! గాజుఱాలయుంగరములు ధరించినా రేమి?

సుబ్బి—గాజురాళ్ళా! గరబాదానంనాడు గదిలో కెల్ల నంటే- మా మాఁవ మూడొంద లోసి కొనిపెట్టిన రవ్వ లుంగరాలు గాజురా ళ్ళుంగరా లన్న గాడి దెవడు ?

చింతా—ఎవ రనఁ గలరు ?-తిన్నఁగా కనఁబడక నేనే యన్నాను.

సుబ్బి—అయితే, యీపాలి తిన్నగా సూడు! (అని చేయి చాచును)

చింతా—మీవ్రేలి నుండఁగా వానినాఁడెము నా కెట్లు తెలియును ?

సుబ్బి—అయితె, అం తనుమానఁ వెందుకూ ?- నీసేతినే వుంచుకుని నిదానంగా సూడు. (అని యొకయుంగరము తిసి యిచ్చును.)

చింతా—(వ్రేలి నుంచుకొని) మీరు చెప్పినట్లు రవ్వలుంగరములే కాని- ఒక్కటి యుంచుకొనిన నా కంతయందముగా లే దేమి ?

సుబ్బి—అయితే, రెండోదికూడా వుంచుకు నే సూడు- అబ్బెంతరఁవే వుంది ? (అని రెండవది తీసి యిచ్చును.)

చింతా—(దానింగూడ వ్రేలి నుంచుకొని యటు నిటు చూచి) ఇప్పు డందముగానే యున్నవి కాని-వీనిని నా కిచ్చినట్లు తెలిసిన మీ రంగనాయకి మిమ్ములను బ్రతుకనీయ దేమో ?

సుబ్బి—(తనలో) వోయి దేవుఁడా ! యీవుంగ రా లిది మింగెయ్యా లనుకుంటోంది కాఁవోసు ! యెరువ్వైనా యేడ్వానుకాను !

చింతా—ఏమిటియాలోచించుచున్నారు? ఏలయిచ్చిపోతిననికాఁబోలు! అట్లయిన నివిగో మీయుంగరములు! (అని తీయునట్లు నటించును.)

సుబ్బి—తియ్యకు తియ్యకు ! అమ్మతోడు ! తీస్తే వొట్టు ! నన్ను సంపుకు తిన్నట్టే ! యెక్కడో యెట్టిమొగంలా గున్నావు !

చింతా—అంతవొట్టు పెట్టినారు గనుక ఆఁగినాను. ఆఁగకున్న నీక నెల్లకాలము దెప్పుదురు. తాంబూలము వేసికొనెదరా ?

సుబ్బి—వోయబ్బో ! తాంబోళానికీ నాకూ సగఁ వెఱుక ! యెనకో పా లేసుకుంటే గుండెల్లో డెక్కట్టి సచ్చినంతపని జరిగింది !

చింతా—అట్లయిన నంతపని వలదుకాని- అత్తరు కొంచెము రాచెద ను గూరుచుండుఁడు. (అని బుగ్గల కత్తరు రాచును.)

సుబ్బి—(పారవశ్యముతో) వవ్వా ! వవ్వా ! యేఁవి సుకం ! యేఁవి సుకం ! యిన్ని సేతులు సూశానుగానీ- యీపాటిసెయ్యి కావణ్ణే లేదు! యెదవసొమ్ము యేంపోతె యేఁవిలెక్క ! సచ్చినా యిల్లాం టోళ్ళ పాదాలకాడ పడి సావాలి ! వోతాపు తగిల్నా సరేకాని- వోపాలి ముద్దెట్టు కుందునా ?

తెరలో—అమ్మి ! యెవరో మేళము కావలె నని వచ్చినారు- ఒక సారి క్రిందికి రమ్ము.

చింతా—క్రొత్తమిదుత యేదో దిగిన ట్లున్నది ! (పయికి) మాయ మ్మ పిలుచుచున్నది- పోయి యిప్పుడే వచ్చెదఁ గూర్చుండుఁడు.

సుబ్బి—పాడుముండ !- పానకంలో పుల్లలాగు సఁవయానికి సక్కా వొచ్చి నాసరదా అంతా సంపేసింది !
చింతా—(శ్రీహరిని గలిసికొని) ఎవరే వచ్చినవారు ?
శ్రీహ—పెద్దిసెట్టి ?
చింతా—పెద్దిసెట్టియే ! యేదో చెప్పి పంపివేయక పోతివా ?
శ్రీహ—వెఱ్ఱిమొగమా ! నాకామాట నీవు చెప్పవలెనా ! నీనిమిత్తము పయికి వ్రాసిన రవ్వలగాజులు వచ్చిన వఁట- బడాయి కతఁ డవి బయటికి కగపడునట్లు చేతఁ బట్టుకొని వచ్చినందునఁ జూచి- సమయము తప్పిన మరల నేమిబుద్ధి పుట్టునోయను సందేహముచేత- ఎవరో జమీందారుగారు అమ్మాయిని చూడవచ్చి మేడమీఁద నున్నారని చెప్పి క్రిందిగదిలోఁ గూర్చుండఁబెట్టి వచ్చినాను. వీఁ డేమయిన చేఁపినాఁడా !
చింతా—చేఁపకున్న చేయిదాఁటి పోనిత్తువమా ! ఇవిగో యుంగరములు (అని యిచ్చి) నేను పెద్దిసెట్టియొద్దకుఁ బోయెదను గాని-నీవు సుబ్బిసెట్టియొద్దకు వెళ్ళి, రేపు రమ్మని చెప్పి వెనుకమెట్లగుండ దొడ్డిదారిని బంపివేయుము. (అని నిష్క్రమించును)
శ్రీహ—వెఱ్ఱిమొగము ! రేపు రమ్మని చెప్పవలె నఁట ! రే పెవరో-తా నెవరో ! పూర్తిగా పురెక్కించి యీరాత్రియే రమ్మనెద. (సమీపించి) అల్లుఁడుగారు ! అదృష్ట మనఁగా మీది ! మాపిల్లకు మీ మీఁద మన సిట్టే కుదిరింది.
సుబ్బి—అబ్బో ! అబ్బో ! నిసంగా! అమ్మతోడే? సేతులో సెయ్యెయి.
శ్రీహ—మిత్తోడు. కాని, దానిని దక్కించుకొనుదారి మీకు తెలిసి యుండవలెను.
సుబ్బి—అయితే, ఆకిటు కేఁవిటో అదికూడా నువ్వే సెప్పు.
శ్రీహ—అబ్బా ! అది యంత తేరగా నున్నదా ! నా కేమిచ్చినారని?
సుబ్బి—యెంతమాటన్నావు ? యేంకావాలో కోరు-యెనకతిస్తే సెప్పు!
శ్రీహ—అదీ- దర్జా ? ఆవలకు పోయి మాటాడుకొందము రండు.

(ఇద్దరు నిష్క్రమింతురు.)




# తృతీయాంకము

రంగము :—చింతామణి యుద్యానము.

(చింతామణీ భవానీశంకరులు తిన్నెపయిఁ గూర్చుండి ప్రవేశింతురు.)

భవా—ఈపూఁట పూర్తిగా ముస్తాబైనావు! ఏమిటి కథ?

చింతా—(మొగము చిట్లించి) క్రొత్తబేరము తగిలినది! తెలిసినదా?

భవా—వచ్చినదా కోపము! ఎంత ముక్కుపట్టని ముత్యమవే!

చింతా—అవు నవును! ఎవరిమాటలు వారి కింపుగా నుండును! ఈపూఁట నెవరో తప్పక పైక మిచ్చెద నన్నా రని నమ్మకముగాఁ జెప్పి వెళ్లినందున–మాయమ్మ నోరు కట్టవచ్చును గదా యని మహాసంతోషముతో ముస్తాబై కూరుచున్నందులకుఁ గలిగిన ఫల మిది! అయిన నది యేమిపాపమో కాని—

క. తమ్మే దైవమ్ముగఁ దమ
నెమ్మనమున నమ్మనీ–గ • ణింపక తమప్రా
ణమ్ముల నేనియు నిడనీ-
నమ్మరు మగవారు స్త్రీజ • నమ్ముల నెపుడున్ !

భవా—ఏచండాలుఁడు!—నిన్ను నమ్మనివాఁడు నిర్మూలమై పోవును! హాస్యమున కన్నమాట కంత యలుక యెందులకు?

చింతా—హాస్యమునకు హద్దుండవలెను! ఒడలుమండు హాస్యమా!

భవా—పోనిమ్మ్మ,పొరపాటుగాని–సుబ్బిసెట్టియెందులకు–వచ్చినాఁడు?

చింతా—అదిగో! ఇఁక నేమి! మనసులో నేదో మలిన ముండనేయు న్నది! అయితే–ఆసంగతి మీ కెవరు చెప్పినారు?

భవా—నేనే చూచినాను. వీధిగుమ్మమున వచ్చినచో మీయమ్మకంటఁ బడవలసివచ్చు నని పెరటిగుమ్మముకడకు వచ్చుసరికి -తటాలున నతఁడు తలుపు తెఱచుకొని, పడాలున బయటికి వచ్చినాఁడు. ఆపాటున నన్నుఁ జూచి యతఁడును – అతనింజూచి నేనును దెల్లపోయినాము. అంతట నతని కనుమానము కలుగకుండునట్లు కోడిగములాడుచుఁ గొంతదూరము వెంట వెళ్ళినాను.

చింతా—(తనలో) అతనిరాకనుగూర్చి యీతఁ డడిగియే యుండును. అయినను, సుబ్బిసెట్టి కోమటిబిడ్డ. కోమటిబిడ్డ సాధారణముగా కోసినను నిజము చెప్పఁడు. కాని, యతఁ డేమిచెప్పెనో తెలియ నప్పుడు నే నేమిచెప్పినను చిక్కే ! ఇవిగో యివియే వెలయాలి తెలివితేటలు వెల్లడిసేయు ఘట్టములు !

గీ. తప్పుపని సేయఁ గలుగుట ♦ గొప్ప కాదు ;
చేసినది బైటఁబడునప్డు ♦ సిగ్గు సెగ్గు
విడిచి ధైర్యముతో గోడ ♦ పెట్టినట్లు
బొంక నేర్చుటె వెలయాలి ♦ ప్రోడతనము.

(ఆలోచించి) సరి కానిమ్ము-ఈత్రోవ త్రొక్కి చూచెదను. (పయికి) ఎందుల కేతెంచితి వని యతని నే యడుగక పోతిరా ?

భవా—అడిగినాను-మేళము కావలసి వచ్చినా నని చెప్పినాఁడు.

చింతా—చెప్పెనుగదా ?- ఇఁక మీసందేహ మేమిటి ?

భవా—నాసందేహమా ?- చెప్పినఁ గోపగించుకొనవు గద ?

చింతా—కోప మెందులకు ?-నాయందు దేమేని పాప ముండినఁ గదా !

భవా—సెబాసు !-అదీమాట ! ఇదిగో యిప్పుడు చెప్పెదను: మేళము కొఱకు వచ్చినవాఁడు -విచ్చలవిడిగా వీధిగుమ్మమున పోక-బెదరుచు పెరటిదారిని పోవుట యేలని నాసందేహము. అదిగో ! మొగము చిట్లించుచున్నావు ! అప్పుడే వచ్చినది కోపము !

చింతా—అట్లయిన నాసంగతి కూడ నతని నే యడుగక పోతిరా ?

భవా—అంతలో నొకబాల్యమిత్రుఁ డగపడి బహుకాల సమావేశము

వలని పరమాదరముచేతఁ గుశలప్రశ్న చేయుచుఁ గూడఁ దీసికొని పోవుటం జేసి యడుగుట కవకాశము లేకపోయినది.

చింతా—అట్లయిన నేనే చెప్పెద నాలకింపుఁడు. మేళమునుగూర్చి మాటాడుటకై మాయమ్మ యతనిని మేడమీఁదికి వెంటఁబెట్టుకొని వచ్చినది. ఇంటికి వచ్చినవారిని మర్యాద చేయుట ధర్మము కనుక గూర్చుండుమని కుర్చీవేసి తాంబూల మీయఁగా— నతఁడు వచ్చిన పని విడిచిపెట్టి యధిక ప్రసంగములు మొదలు పెట్టెను. అందులకుఁ జిరాకు వచ్చి, చప్పున నేను మేడ దిగి చక్కఁబోయితిని. మాయమ్మ నామనసు కనిపెట్టి, త్రోఁటఁ జూపుట కనుమిషమీఁద నాతని దొడ్డిలోనికిఁ దీసికొనిపోయి, యాదారినే యవలకు సాగనంపినది. నమ్ముఁడు నమ్మకపొండు—నడచినసంగతి యిది.

భవా—వెఱ్ఱిమొగమా ! నీమాట వేదముగానెన్నఁడునమ్మ లేదు ! నాతో నీ వెన్నఁడు నలుసంత యబద్ధ మాడవనియే నా నమ్మకము.

చింతా—మీతోడనే కాదు- ఎవ్వరితోడను నే నబద్ధమాడను. చింతామణి యీకులములోఁ బుట్టవలసినది కాదని చిన్నలుఁ బెద్దలు నన్ను శ్లాఘించుట కిదియే కారణము.

భవా—సందేహ మేమి ? ఎవరి మాటయో యేల ?— నే నెన్నిసారులు శ్లాఘింప లేదు ?

ఉ. ఎందఱులేరు వారవన • జేక్షణ లిప్పురమందుఁ - గల్లలం
గందువమాటల న్విటుల • గారడి సేయుచు, దొళ్ళదోఁపుగా
వందలు వేలు గుంజుకొను • వారలె కాని-విశుద్ధవృత్తి నీ
చందమునం గుణాగుణ వి • చారము సల్పెడివారు గల్గిరే !

చింతా—ఏమి లాభము !

ఆ. ఆటవెలఁది యనిన • యంతనే కవులకు
వలెనె యెల్లరకును • జులుకతనము !
గణిక మంచి, గ్రామ • కరణంబు మంచియు
మెచ్చువారు లేరు • మచ్చునకును !

సరి, దీని కేమి కాని- మీరు చనినపని యే మయినది ?

భవా—ఏమగుట కేమున్నది ! దైవము తలఁచుగా ధనికుల నాలుకలు తాటిపట్టెలతోడను- చేతులు చేవమ్రాకులతోడను- హృదయము లుక్కు ముక్కలతోడను జేయుచుండును ! ఆపయిని,

గీ. కన్ను లున్నను దీనులు ♦ కానఁబడరు !
వీను లున్నను మనవులు ♦ వినఁగఁ బడవు !
అట్టివారల నాశించి ♦ యాశ్రయించు
వారు కడుఁ జెల్విమాలిన ♦ వారు సూవె !

చింతా—ఇది యంతయు-చావుకబురు చల్లఁగాఁ జెప్పుట కావలయును!

భవా—ఇప్పటి కంతియే కాని- రెండుమూఁడు దినములలోఁ దప్పక సానుకూలము కాఁగలదు.

చింతా—సరి యిఁక నేమి ! యెప్పటిపాఠమే దిగినది ! మఱొక విశేషము !- ఇదివఱకు " రేపు రేపే ,,- ఆరేపున కిప్పుడు మఱి రెండు త్రోఁపులుగూడ తగిలినవి !

భవా—కాదు కాదు ! నామాట కడవఱకు విని, అప్పుడు నీకుఁ దోఁచిన ట్లనుము ! ఇంతవఱకు నిదిగో యదిగో యని త్రిప్పిన తుంటరి యీపూఁట తొంటచేయి చూపినాఁడు-

చింతా—ఇఁక విననక్కఱలేదు ! అంతట మఱియొక తుంటరి నాశ్రయించినారు- ఆతుంటరి కొన్ని రేపులు గడపి యావలఁ దానొక తొంటచేయి చూపును ! మీ రా తొంటచేతు లన్నియుం దెచ్చి మాయింట తోరణము గ్రుచ్చుదురు ! అంతియేనా ?

భవా—మాట సాంతముగ వినకయే మండిపడిన నే నేమి చెప్పఁగలను !- చిరాకు మాని చివరంట వినుము-

చింతా—ఇక్కడ, కిరువదిదినములనుండి విని విని ప్రాణము విసిగినది- ఇంకను నేమి విసను ! ప్రతిదినము మాయమ్మచేత నేను పడలేక చచ్చిపోవుచున్నాను ! మధ్యాహ్నము మీరు వెళ్ళినది మొదలు మాయమ్మ నన్ను కోసినకోఁతకు నేను గనుక భరించితిని గాని-

మఱొకతె యైనచో మందో నూకో మ్రింగి చావవలసినదే !-
ఇఁక పడలేను ! ఇంతటినుండి మీదారి మీది ! నాదారి నాది !

భవా—అమ్మయ్యో ! అట్లయిన నేను బ్రతుకఁ గలనా !

చ. విడిచితి బంధువర్గముల • వీడితిఁ బ్రాణము లొగ్గుమిత్రులన్
విడిచితి నిల్లు వాకిలియు • వీడితి భార్యను బ్రాఁతచెప్పఁగా
విడిచితి నెగ్గుసిగ్గు లర • విందదళేక్షణ ! నీనిమిత్తమై !
విడువనె దేహ మీవు నను • వీడునవస్థ తటస్థ మైనచోన్ !

చింతా—(తనలో) నాచెవు లీపలుకుల నిదివఱ కెన్నినోళ్ళగుండ వి
న్నవో !-యిఁక నెన్నినోళ్ళగుండ వినఁగలవో ! (పయికి) నాయం
దేమిదోష మున్నది ? ఈనెలలో మీ రెట్టిని యేగా నిచ్చినారా ?

భవా—ఎక్కడికి వెళ్ళిన నక్కడనే చుక్కయెదు రగుచున్న దేమి చే
యఁగలను ! ఉన్నంతవఱకు నే నేమయిన సుపేక్ష చేసితినా ?

సీ. తాతలనాఁటి క్షే • త్రములెల్ల తెగనమ్మి
దోసిళ్ళతోఁ దెచ్చి • పోసినాను
తండ్రి కట్టినయిల్లు • దాయాదులకు విక్ర
యించి వస్తువులు చే • యించినాను
అత్తవా రిచ్చిన • యంటుమామిడితోఁట
యీవు కోరఁగ వ్రాసి • యిచ్చినాను
కులసతి మేని సొ • మ్ములు పుస్తెతోఁ గూడఁ
గొనివచ్చి నీయింట • గుప్పినాను
కులమువారెల్ల నీ కిది • కూడ దన్న
భార్య నూతికి గోతికిఁ • బఱువు లిడిన
లెక్కసేయక నీయిల్లు • కుక్కవోలెఁ
గాఁచికొని యిట్టు లున్నాను • గలికి ! నేను!

చింతా—(తనలో) పాప మిది యంతయు వాస్తవమే ! కావుననే
కఠినముగాఁ జెప్పుటకు నోరు రాకున్నది ! (పయికి) సరికాని, నేను
మాత్ర మేమిలోటు చేసినాను !-

సీ. తనకుఁ గల్గినదెల్ల • ధారవోసినయట్టి
సీతాసతికి స్వస్తి • చెప్పినాను
మెచ్చి ముచ్చటతీఱు • మేడ కట్టించిన
పోలిసెట్టిని చాలఁ • ద్రోలినాను
నిముసంబులోన మా • న్యము వ్రాసియిచ్చిన
యాదిరెడ్డిని సాగ • నంపినాను
కోరిన బంగారు • కొండనేనియుఁ దెచ్చు
పెద్దిసెట్టికి పొద్దు • పెట్టినాను
క్రొత్తసరసులు చెలరేఁగి • చిత్తకార్తి
కుక్కలంబలె నిలుచుట్టుఁ • గ్రుమ్మరిలుట
కాంచి, మాయమ్మ నన్నెంత • కసరుచున్న
నీకె లోఁబడి యున్నాను • నిజముగాను!

భవా—నీవు లోటుచేసితి వని యేచండాలుఁ డన్నాఁడు! మీయమ్మ మాత్ర మెన్నఁడైన నన్ను పల్లెత్తుమా టాడినదా! దినములు కొంచెము తారుమా అగునప్పు డిట్టిగృహచ్ఛిద్రము లెంతటివారి కైన నున్నవే! కానిమ్ము, పడినగోడలు పడినట్లే యుండవు! దైవ మందులకే యీపూఁట నతనిని దారసిలఁ జేసినాఁడు!

చింతా—ఎవ రా తారసిల్లినవారు?

భవా—నే నిందాఁక నే తెలుపఁబోఁగా నామాట పూర్తి కానిచ్చినావు కావు. ఆతారసిల్లిన యతఁడు బిల్వమంగళుఁడు. బిల్వమంగళుఁ డన: నేటియావలఁ గ్రొత్తగాఁ గర్మాగారములు, కార్యస్థానములు, మేడలు, మిద్దెలు కట్టుకొని కాఁపురమున్న వాసుదేవమూర్తి గారి కుమారుఁడు–

చింతా—(తనలో) ఏమి! అనాఁడు నేను జూచిన యందగాఁడె కావలయును! చిత్రము!–

కం. వల పెఱుఁగని నాహృదయము
కళవళపడె నతనిమోము • గనినంతనె; వు

ల్కలు జనియించెను చెక్కుల
నిలువెల్ల వడంకె నొక్క • నిముసము దనుకన్ !
(పయికి) ఎఱ్ఱిగా-పుష్టిగా-పొడుగుగా నుందురే ఆయనయేనా ?

భవా—ఆయనయే, ఆయనయే- నీ వెప్పుడు చూచితివి ?

చింతా—ఒకప్పుడు గోపాలస్వామివారి కోవెలలోఁ గళ్యాణసమయమునఁ గాఁబోలు చూచితిని. వారు చాల భాగ్యవంతు లనివాడుక-యేపాటిస్థితి యుండును ?

భవా—నలుబదిలక్షలవఱ కుండు నని నాసమ్మకము. ప్రకృతము వినుము. ఆబిల్వామంగళుఁడును నేనును సహాధ్యాయులము ఆదినములలో నతఁడే నేను- నేనే యతఁడు.

ఉ. ఆడిన నొక్కయాట ; నడ • యాడఁగడంగిన నొక్కబాట ; మాటాడిన నొక్కమాట ; నిశ • లందుఁ బరుండిన నొక్కచోట; నీజాడ నొడళ్లు వేఱయిన • సంతత మాత్మలు వేఱు గాక, మాతోడివయస్యు లీర్ష్య గొనఁ • దోఁచితి మిర్వుర మొక్కరూపునన్.

చింతా—అట్టివారు విడిపోవుట యెట్లు సంభవించినది?

భవా—అతఁ డాంధ్రము చాలించి సంస్కృతపాఠశాలలోఁ బ్రవేశించినాఁడు; నేను జదువు చాలించి సానివాడలోఁ బ్రవేశించినాను ! అందువల్ల సంబంధము పూర్తిగాఁ దప్పిపోయి, యొకరి నొకరము మఱచిపోవువఱకు వచ్చినారము! వాసుదేవమూర్తిగారు సంవత్సరముక్రిందట వ్యాపార మంతయు నతనివశము చేసినారఁట. ఈమధ్య నా కితఁడే జ్ఞప్తికి వచ్చియుండెనా !

చింతా— వచ్చినయెడల ?

భవా—వచ్చినయెడల-బడులుకోఱకు వారిని వీరిని దేవురించుచుఁ గూర్చుందునా ! అతఁ డెంతమంచివాఁడు! నే నేమడిగిన నీయఁడు! ఎంతప్రీతితో మాటలాడినాఁ డని చెప్పుదును ! నాకష్టసుఖములన్నియు నడిగినాఁడు-తనమంచిచెడ్డ లన్నియుఁ జెప్పినాఁడు-ఇంటికిఁ దీసికొనిపోయి తనతో భోజనము చేయువఱకు విడిచినాఁడుకాఁడు.

బదులుమాట వెంటనేతలపెట్టుట భావ్యము కాదని, రేపు వచ్చెద నని చెప్పి చక్కవచ్చినాను. ఏమిటి యాలోచించుచున్నావు ?

చింతా—ఏమియు లేదు కాని- యెట్లయిన మనయింటి కాయన నొక సారి తీసికొనిరాఁగలరా ?- అదేమి ! అట్లు తెల్లపోయినారు !

భవా—అబ్బే ! అదికాదు- ఎందునిమిత్తమా—అని.

చింతా—మీరును నేనును గూడ బాగుపడు నిమిత్తము.

భవా—అదెట్లు ?

చింతా—ఆవివర మేమియు నన్నిపుడడుగ వలదు. నానీతికి భంగము కానీయ ననిమాత్రము నమ్ముఁడు.

భవా—ఆ సందేహము నాకెన్నఁడు లేదు కాని-అతని నిచ్చటికి రప్పించుట యలవియైన కార్యముమాత్రము కాదు.

చింతా—ఎందుచేత ?

భవా—మహాపండితుఁడు-

చింతా—వ్యాసునికంటెనా ?

భవా—పరమ నైష్ఠికుఁడు-

చింతా—విశ్వామిత్రునికంటెనా ?

భవా—బహునీతిమంతుఁడు-

చింతా—విప్రనారాయణునికంటెనా ?

భవా—పరస్త్రీ పరాఙ్ముఖుఁడు-

చింతా—ఋశ్యశృంగునికంటెనా ? ఎందుల కీలక్కగేద బేరములు ?

ఉ. ఇంతులు తారసిల్లువఱ • కే పురుషాగ్రణు లెంతలేసి సా
మంతము లాడినం, బిగువు • మాటలు పల్కినఁ ; గామినీమణీ
కాంత దృగంచలాగ్ని కలి • కాలవ మించుకపాటి సోకనే
నెంతటిపండితుండయిన • నిట్టె కరంగఁడె, వెన్నపోలికిఁ !

భవా—అగుఁగాక- అతనిభార్య భూలోకరంభ-

చింతా—వెఱ్ఱివాఁడా ! సానులయిండ్లకుఁ జనువారిలో నెవనిభార్య చక్కనిది కాదు ? ముందు నీభార్యమాట చెప్పుము!

గీ. ప్రాణములు గలిగినట్టి మే • ల్పసిండి బొమ్మ !
అవయవంబులు గలిగిన • యలరు గొమ్మ !
అట్టిభార్యను విడిచి నీ • వకట ! నేఁటి
కెన్నికొంపలు చొచ్చితో • యెఱుఁగ వొక్కొ !

భవా—(తల వంచుకొని) నీ కెవరు బదులు చెప్పఁ గలరు !

చింతా—బదులు చెప్పుటతోఁ బని లేదు- నేను జెప్పినట్లు చేయుదు రేని యాయనను మనయింటి కాకర్షించు భారము నాది. ఆమీఁద నాయన కున్న నలుబదిలక్షలలో సగము మీది- సగము నాది!

భవా.— వెఱ్ఱిదానా ! నీదేమిటి నాదేమిటి! నాయభ్యంతర మేమియు లేదు. నన్ను గంగలోను ముంచుమన్న గనులుమూసికొని యుతికెద.

తెరలో—అమ్మా ! యే మా చిదంబర రహస్యములు !

చింతా—(తనలో) సుబ్బిసెట్టి వచ్చినట్లున్నాఁడు ! ఇతనికన్నులలోఁ గారము చల్లి యిఁక నే నతని కడకుఁ బోవలెను గావలయును ! యేమి విపరీతజీవనము !

ఆ తలఁచు తలఁపు లెల్ల • ధర్మేతరంబులు !
పలుకు పలుకు లెల్లఁ • బ్రబల మృషలు !
చేయు చేఁత లెల్ల • చెనఁటిమాయలు ! వెల
చెలువ నేటికో సృ • జించె నలువ !

(పయికి) మాయమ్మ కేక వింటిరికదా ? చిచ్చుఱపిడుగులాగున వచ్చిపడుచున్నది ! ఈసమయమున నే నిచ్చట నుండరాదు. పయి సంగతి తరువాత మాటాడుకొందము. (అని తిన్నె దిగును.)

భవా—నీ వుండిన నేమి ?

చింతా—మతేమియు లేదు- మీరు కనఁబడఁగానే యది యగ్గిమీఁది గుగ్గిలము కాకమానదు. మిమ్ముల ననుచుండఁగా నేను వినుచు నూరకుండ లేను-ఉండ లేక యేమేని యన్నచో మిమ్ములను వెనుక వేసికొనివచ్చితి నని నామీఁదఁ బడును. కాఁబట్టి నేను లోపలికిఁ బోయి దానికోపము తగ్గినవెనుక వచ్చెదను. (అని నడచును.)

భవా—వెఱ్ఱిముండకు నామీఁద నెంతయభిమానమో ! వారకాంతలకు వల పుండ దనువారు- ఏటియావల నూ ళ్ళుండ వనువారివంటి వారు ! ఇ దంతయు వలపు కాక- యిం కేమిటి !
శ్రీహ—(ప్రవేశించి, చింతామణి కెదురు వచ్చును).
చింతా—(మెల్లఁగా) వచ్చినాఁడా ?
శ్రీహ—చచ్చినట్లు !
చింతా—అట్లయిన, నే నతనిం బంపివేసి వచ్చువఱకును నీ వీతని-
శ్రీహ—కుక్కినపేనుం జేసి కూర్చుండఁ బెట్టెదను. (బిగ్గరగా) అమ్మ ! నేను రాఁగానే నీవు వెళ్ళుచుంటి వేమి ? ఆయ నెక్కడ ?
చింతా—(బిగ్గరగా) నేను దప్పిగొని వెళ్ళుచున్నాను. ఆయన యచ్చటి తిన్నె మీఁదఁ గూర్చున్నారు. (అనుచు నిష్క్రమించును).
శ్రీహ—(భవానీశంకరునివంకకు నడచును).
భవా—ఓయి దేవుఁడా ! అదియన్న ట్లీముండ యగ్గిపిడుగులాగుననే వచ్చుచున్నది ! బ్రహ్మదేవుఁడా ! నీబుద్ధియింత బుగ్గియైన దేమి ?

సీ. దివ్యస్థలంబగు • తిరుపతి కొండను
  కోఁతిమూకను జాదు • కొలిపినావు !
తతహంసతూలికా • తల్పంబులందును
  జెడు నల్లులను సృష్టి • చేసినావు !
ప్రీతి నించెడు గులా • బీ చెట్లులను వాఁడి
  మించెడు ముండ్లు సృ • జించినావు !
ప్రభువుల మందిర • ప్రాంగణంబుల మూర్ఖ
  వేత్రహస్తులను గ • ల్పించినావు !
సౌఖ్యముల కాకరములైన • సానియిండ్ల
విటుల నెత్తురు పీల్చెడి • వేశ్యమాత
లనుమహాపిశాచములఁ గా • పునిచినావు
గదర ! వృథగాను ! నీతెల్వి • కాలిపోను !

(తెర పడును).

ఇది తృతీయాంకము.




# చతుర్థాంకము

రంగము:—బిల్వమంగళుని కార్యస్థానము.

బిల్వ—(బయటికి వచ్చి) అమ్మయ్యా! యీపూఁట బల్లకడనుండి యిప్పటికి లేవఁ గలిగితిని! కాని, యేనాఁటిపని యానాఁడు ముగించుకొనుటయె యెక్కుడు సుఖము. అందును వర్తకున కట్టి నియమ మత్యవసరము. అంతియే కాదు.

సీ. కనులును జెవులుఁ జ • క్కఁగ విచ్చి నిచ్చలు
దేశకాలస్థితుల్ • తెలియ వలయు
కొనువేళ కాని యె • క్కువపెట్టి యైనను
మంచివస్తువు కొని • యుంచవలయు
అమ్మునప్పుడు కాని • యటులైన నిటులైన
నచ్చరొక్కమునకె • యమ్మ వలయు
కొలతపట్లను, దూని • కలపట్లు, లెక్కల
పట్లను నీతితోఁ • బరఁగ వలయు
పెక్కుగొడవలు నెత్తిపైఁ • బెట్టుకొనక
యొక్కవ్యాపారమునె నమ్మి • యుండవలయు
బహుజనాకర్షణమునకుఁ • బాటు పడుచు
స్వల్పలాభంబుతోఁ దృప్తి • పడఁగ వలయు.

(రవంత నడయాడి) ఈపూఁట భవానీశంకరుఁ డెందుచేతనో యింకను రాలేదు! మైత్రియం దేమిమహిమ యున్నది!—

ఉ. వేళకు రాక మిత్రుఁ డొకఁ • డీసము జాగొనరించె నేని కా
    ల్గాలిన పిల్లివోలె మది • గంతులు వేయును! జూడ్కు లెంతయుం
    గాలిమి మాలి యెల్లపుడు • ద్వారమువంకనె తారులాడు! ను
    ద్వేలముగా విన న్నిగుడు • వీనులు చీమ చిటుక్కుమన్నచోఁ.

ఇది మాత్రము బహు చిత్రమైన సంగతి!—

గీ. మిత్రుఁ డెప్పుడును వారిజ • మిత్రులీలఁ
    దనదువంక నాకర్షించు • కొనుచు నుండు;
    బ్రొద్దుతిరుగుఁడు పూవునుం • బోలెఁ దవిలి
    యనునిమేషముఁ దానును • ననుసరించు!

రవంత గాలి తగిలినఁ గాని విశ్రాంతి కలుగదు. (తెరవంకఁ జూచి) కేశవా! భవానీశంకరుఁడు వచ్చినచో నేను దోఁటలోని విలాసభవనముకడ నుందు నని చెప్పుము. (అని నిష్క్రమించును.)

భవా—(ప్రవేశించి) చిత్రము!

గీ. తీపు లన్నిటఁ జన్నిపూఁ • దేనె తీపి;
    దానికంటెను బ్రాణ మెం • తేని తీపి;
    ఆలి దానికంటెను దీపి; • యంతకంటె
    వేయిరెట్టులవఱకును • వేశ్య తీపి!

ఇంత యేల—.

గీ. కామధేనువు వాకిటఁ • గలుగుఁ గాక
    కల్పవృక్షము పెరటిలోఁ • గ్రాలుఁ గాక
    ప్రౌఢ యైనట్టి భోగిని • పొత్తు లేక
    కాంచ నేరఁడు పూర్ణసు • ఖంబు జనుఁడు!

కావుననే,

సీ. తమయిల్లు విడినాఁడె • తమదెల్లఁ బోనాఁడె
    వారకామినిపంచఁ • జేరువారు
    తమలజ్జ విదిలించి • తమవారి నదలించి
    గణికనింటనె చేర్పుఁ • గలుగువారు

అడిగిన దర్పించి • యభిమానము త్యజించి
సానికి దాస్యంబు • సలుపువారు
ఇల్లు గుల్లగఁ జేసి • యిల్లాలి నెద రోసి
వేశ్యకై యూరూరు • వెడలువారు
వేశ్యమాతల భీతి సే • వించువారు
స్యాలకుల కష్టనంబు లో • సంగువారు
కూఁతులకు నల్లురం దెచ్చి • కూర్చువారు
కలిగియున్నారు సను మించఁ • గలుగువారు !

కాఁబట్టి, నే నీకార్యమున కంగీకరించుటలో గౌరవహాని యేమి యు లేదు. గడుసుముండ !— చక్కని యాలోచన చేసినది ! ఈ యెత్తు సాగెనా- యికఁ జెప్పవలసిన దేమున్నది !-యిరువురమును హాయిగ సుఖింతుము ! ఈయాలోచన పుట్టి యిప్పటికి రమారమి నెల యైనది. అప్పటినుండీ ప్రతిదినము బిల్వమంగళునికడకు వచ్చి పోవుచు మరల నెప్పటి చెలిమి పాసఁగించితిని. ఈప్రొద్దు మంచి దని గాలము వేయుటకు నిశ్చయించుకొంటిమి కదా ? అదృష్టము తిరిగినచో—అనుకొన్న చొప్పున చేఁప తగులుకొననే గలదు. నేను నిర్భాగ్యుఁడ నైనను—చింతామణి దినములైన మంచివి కాఁ గూడ దా ? (పరిక్రమించి, పైఁకి జూచి) కేశవా ! కార్యస్థానము నిశ్శబ్దము గా నున్నది- బాబుగారు మేడకు వెళ్ళినారా యేమి ? (వినుట నభినయించి) ఏమంటివి ?—మీకొఱ కెదురుచూచుచుఁ దోఁటలోని విలాసమందిరముకడఁ గూరుచున్నా రనియా ?—అట్లయినఁ బెరటి దారినిఁబోయి యతని కాకస్మికముగఁ గనబడెదను. (అనినడచును).

(అంతటఁ దెర యెత్తఁబడఁగా నాసనస్థుఁడై బిల్వమంగళుఁడు ప్రవేశించును.)

బిల్వ.—చిత్తశాంతి లభించునపుడెల్ల విధిగాఁ జేయఁదగినది భగవద్విచా రము. భగవద్విచారమున కేదో యాశ్రయించుట కాని— పద్మా సనము వేసికొని యేమూలనో ముక్కు మూసికొని కూర్చుండు ట కాని— యవసరము లేదు.

చ. కలకలలాడు చెల్లపుడు • గట్టెదుటం గనుపట్టు తీనెగుం
పులు, మొలకల్, మహీజములు•పూవులు,కాయలు, పండ్లు;పర్వతం
బులు,నదులుల్,సముద్రములు•భూమి,దివం,బివియొక్కటొక్క టే
తెలుపఁగఁ జాలు నీశ్వరుని • దివ్యవిలాసము లెల్లఁ గొల్లగా !

భవా—(సమీపించి) మిత్రమా ! యేమిటి యాలోచించుచున్నావు ?

బిల్వ—(చటాలునఁ దలయెత్తిచూచి) ఇదిగో! వచ్చితివా!–నేఁ డేవే ళకు రాకపోఁగా–నేదో గ్రామాంతరమునకుఁ బోతి వనుకొంటిని !

భవా—(తల వ్రేలవైచి) గ్రామాంతరమునకుఁ గాదు గాని– గృహాంతరమునకుఁ బోయి–పుట్టెడు పరాభవముతో వచ్చితిని !

బిల్వ—అదేమి ?

భవా—ఏమని చెప్పుదును !– చెప్పినచో నవ్వుదువు !

బిల్వ—ఎంతమాట ! నీపరాభవమునకు నేను నవ్వుదునా !

భవా—ఊరక యంటిని. నీవు నవ్వ వనియే కాదు–నాపరాభవము నీ పరాభవముగా భావింతు వనికూడ నే నెఱుఁగుదును.

బిల్వ—సందేహమా !– చెప్పు చెప్పు–ఏమది ?

భవా—మనపట్టణమునఁ జింతామణి యను నొకవేశ్య కలదు ; దాని వృత్తాంత మెప్పుడైన వింటివా ?

బిల్వ—మనము విన దగిన వృత్తాంత మది యేమి కలిగియుండును ?

భవా—అట్లయిన నీవు వినలే దన్నమాటయే. రూపమునకు రంభ–సంగీత సాహిత్యములకు సరస్వతి! కాని, దాని విద్యాగర్వమునకు మాత్రము మేర లేదు. చదువు రానియెడల సార్వభౌముఁ డైనను గుమ్మము త్రొక్కనీయదు ; కంతుఁ డైనను, కన్నెత్తి చూడదు. చదువరి యగునెడల–సన్యాసి యైనను గౌరవించును ; దాని పరీక్ష కాఁగినవానిని దైవముగఁ బూజించును !

బిల్వ—అట్లయిన నది గర్వము కాదు– గుణ మనియే చెప్పఁ దగును.

భవా—కావచ్చును. ఈసంగతులు నా కెందఱు చెప్పినను–వేశ్యలపట్ల నివి విపరీతగుణము లని నేను నమ్మ లేదు. ఈపూఁట నొకమిత్రుఁ

డిందలి యాథార్థ్యమును బ్రత్యక్షముగాఁ జూపుటకై నన్ను దాని యింటికిఁ దీసికొని పోయెను. దానిమేడ, దానిభాగ్యము దాని భోగము వీనిమాట కేమి కాని- దానిసౌందర్యమును జూచుటకు నాకుఁ గన్నులు చాలినవి కావు !

బిల్వ—(నవ్వి) నాకన్నులుకూడ నెరవు తీసికొనిపోక పోతివా ?

భవా—(తనలో) నీకన్నులు కర్మ మేమి ! నిన్నే తీసికొనిపోవలె నని కదా-యీయత్నము ! (పయికి) నీకన్నులు కాదు కాని- నీపాండిత్య మెరవు తీసికొని పోఁగలిగినచో- నా కీపరాభవము కలుగకపో యెడిది ! తరువాయి వినుము: నన్నుఁ దీసికొనిపోయిన మిత్రుఁడు పంచకావ్యములు ముగించి, ప్రతాపరుద్రీయము చేతఁ బట్టినవాఁ డగుటచే, నతనివెంట వెళ్ళుటంబట్టి నేనుగూడ నేమో వెలుగఁజెట్టియుందు ననుతలంపుచే-నాకుఁగూడ దండము పెట్టి యాసనము వేసినది. నామిత్రుఁ డంతటితో నూరకుండినచో నేగొడవయు లేక పోయెడిది. నా కేమో త్రవ్వి తల కెత్తించుటకుం బోలె-నన్నొక పండితునిఁగాఁ జెప్పుటకు మొదలుపెట్టెను! అది వినివిని- ,,అయ్యా! మీ రెవరియొద్దఁ జదువుకొన్నా?,, రని నన్నుఁ బ్రశ్నించినది. అప్పుడు నాకైన బుద్ధి యుండవచ్చునా ?- అది మెచ్చి మేఁకతోలు కప్పు నను నూహతో "సకలకలాసంపన్నుఁడగు బిల్వమంగళమూర్తి నా కాబాల్యమిత్రుఁడై యుండ నెవరియొద్దనో చదువుకొనవలసిన పని యే'' మని యొయ్యారముగా నుత్తర మొసఁగితిని.

బిల్వ—(నవ్వుచు) ఈవిధముగా నాపేరు దానిచిట్టాలోనెక్కించితివా!

భవా—నేను గ్రొత్తగా నెక్కింప లేదు. నీపాండిత్యము, నీ తెలివి, నీ చక్కఁదనము పూసగ్రుచ్చిన ట్లదే యేకరు పెట్టినది. మొదటే వేశ్య- ఆపయిని పడఁజదివిన ముండ- ఆపాటి విచారణ లేకుండునా? అది కాక-మెరకవీథిని మేఁక యీననిమ్ము-పల్లపువీథిని పడ్డ చావ నిమ్ము- బోగముదానియింట నుండును !

బిల్వ—సందియ మేమి !

ఆ. సంత, రచ్చపట్టు • సారాదుకాణంబు
గణిక యిల్లు, చెరువు • గట్టు, వంట
పూఁటియిల్లు, వెచ్చ • ములయంగడియు వ_ర్త
మానములకు మంచి • తానకములు !

పయిసంగతి కానిమ్ము.

భవా—పయిసంగతి పరాభవమే ! నాబండారము నామొగమువల్లనే కనిపెట్టినదో, నామాటలవల్లనే కనిపెట్టినదో చెప్పఁజాలను గాని-చటాలున నొకశ్లోకము చదివి, దీనిభావ మేమని యడిగినది. ఇంకఁ జెప్పవలసిన దేమున్నది ! ఆపాటునఁ గాళ్ళుఁ జేతులుఁ జల్లఁబడినవి ! వెఱ్ఱిమొగమునైచి వెలవెలఁబోవుచు నూరకున్నాను ! నన్నుఁ దీసికొనిపోయిన మిత్రుఁడు కొంత పీకులాడెను గాని- పాప మతనికిని గొఱుకువడినది కాదు ! అప్పు డది నన్నుఁ జూచి పక్కున నవ్వగా-బల్లెమువలె నా కది ప్రక్కలోఁ గ్రుచ్చుకొన్నది ! అయిన నందులకుఁ జేయవలసిన దేమున్నది !-సిగ్గుపడి శిరమువంచుకొన్నాను ! అది యంతటితోనైన నన్ను విడువక, యాశ్లోక మొక కాగితమున వ్రాసి " ఇక్కడికి మీసంగతి సాంతముగాఁ దెలిసినది-మీ గురువుగారి సంగతికూడఁ దెలఁగలదు- దీని కేమి చెప్పుదురో పోయి దెలిసికొని రం ,, డని యిచ్చినది. ఆమాటకు మఱింత క్రుగ్గినవాఁడనై-అఱగంటలో దీనిభావ మామూలాగ్రముగాఁ దెలిసికొని వచ్చి చెప్పెదఁ జూడు మని శపథము చేసి చక్కవచ్చితిని.

బిల్వ—ఏ దా కాగితము ?

భవా—ఇదిగో. (అని యిచ్చును.)

బిల్వ—(తీసికొని)

శ్లో. వృక్షాగ్రవాసీ నచ పక్షిరాజః-చర్మాంగధారీ నచ సోమయాజీ
త్రినేత్రధారీ నచ శూలపాణిః-జలంధరిత్రీ నఘటో నమేఘః.

(అని పఠించి) మిత్రమా ! దీనిభావమే స్ఫురింపలేదా ?

భవా—పద్యమున కర్థము తెలిసినఁ గదా-భావము స్ఫురించుట !

బిల్వా—అట్లయిన నర్థము చెప్పెద వినుము. వృక్షాగ్రవాసీ: చెట్టుపై నుండును - కాని, నచ పక్షిరాజః: పక్షి కాదు - చర్మాంగధారీ: చర్మమును ధరించును; కాని, నచ సోమయాజీ: సోమయాజి కాఁడు త్రినేత్రధారీ: మూఁడుకన్నులుండును; కాని, నచ శూలపాణిః: శివుఁడు కాఁడు-జలం ధరిత్రీ: జలము కలిగియుండును - కాని, నఘటః: కుండ కాదు-న మేఘః: మేఘము కాదు. తెలిసినదా?

భవా—ఇప్పుడును నాకినుపగుగ్గిలిగానే యున్నది!

బిల్వా—వెఱ్ఱివాఁడా! "టెంకాయ" యన్నమాట కాదా?

భవా—(వ్రేలుకఱచుకొని) అన్నన్నా! అవును జుమా! నేనిప్పుడే పోయి యీముక్క చెప్పివేసి వచ్చెద-నేను వచ్చుదనుక నీ విచ్చటనే యుండుము (అని నిష్క్రమించును.)

బిల్వా—ఓహో! సాయంసమయ మెంత సమ్మోదకరముగా నున్నది!

ఉ. చల్లని పిల్లగాడుపులు; • చక్కఁగ విచ్చిన పూలు; కెంపుతో
నుల్లసమాడు నాకసము; • వ్యూహములం జను పక్షిసంతతుల్
మెల్లఁగ మింటఁ దారు చిఱు• మేఘము; ల య్యపరాద్రివెన్కరా
జిల్లెడు సూర్యబింబము; వ • చింపఁగ శక్యమె సంధ్యసంపదల్!

భవానీశంకరుఁడు వచ్చుదనుక నేనీ పారిజాతములకుఁ బాదులు చేయుచుఁ గాలము గడపెద. (అని రవంతసే పట్లుచేసి యవ్వల దిశలు పరికించి) ఓహో! చీఁకటి యెంతలో సిద్ధమయినది!

చ. క్రమముగ నెల్లవస్తువులఁ • గాంచె దళంబగు నల్పుచాయ; మా
ర్గమును సమార్గముం గలిసి • కన్పడఁ జొచ్చెను నేకభంగి; లో
కమునకుఁ బ్రాప్తిలెం గనులు • గల్గియు గ్రుడ్డితనంబు; మిన్నుమా
త్రము తన నేత్రకోటులను దద్దయు విచ్చి కనుం బ్రపంచమున్!

(ప్రక్కకుఁ జూచి) ఇదిగో!- కేశవుఁడు కాఁబోలు నిచ్చట దీప ముంచి వెళ్లినాఁడు మిత్రుఁడు రాలేదు! నాయనగారు నాకొఱ కెదురుచూచుచుందురు. ఇదిగో పులకలు! ఏమిచిత్రమో కాని- నాయనగారు తలపునకువచ్చినపుడెల్ల నాశరీరమిట్లు పులకించును!

ఆ. వేళ కేఁగకున్న ♦ వెదకుచుఁ జనుదెంచుఁ
బంక్తి కరుగకున్నఁ ♦ బరితపించు
నుంత యలపుఁ గొన్న ♦ నెంతయుఁ బలవించుఁ
దరమె తీర్ప నిట్టి ♦ తండ్రి ఋణము !

భవా—(ప్రవేశించి) మిత్రమా ! నీవిద్యామహిమ యిప్పటికి నిశ్చయముగా వెల్లడియైనది! కోటీశ్వరులు కొంపచుట్టు తిరిగినను లెక్కసేయని చింతామణి కుక్కవలె నావెంటఁబడి చక్కవచ్చినది !

బిల్వ—(ఆశ్చర్యముతో) అదేమిటి ?

భవా—చాలకాలమునుండీ దానికిఁ గొన్ని సందేహములు కలవఁట. అవి నీవల్లఁ దీర్చుకొనవలె నని యరుదెంచినది.

బిల్వ—(ఆందోళనముతో) అయ్యయ్యో !-యెందులకు రానిచ్చితివి!-యెవరైనఁ జూచిన నే మనుకొందురు !

భవా—మిత్రమా ! ఆఁడుదానిని అశ్వమును నెవ రాఁపఁగలరు! నీవు చెప్పిన శ్లోకభావము వినఁగానే నీయం దెక్కడలేని లక్ష్యమును గుదిరి -తనసందేహములు నీవలనఁ గాని నివారణ కావని అదే ముందు దారితీయు నప్పుడు - అడ్డుట కలవి యగునా !

బిల్వ—కానిమ్ము -గతజల సేతుబంధన మెందులకు ! బయట నిలిపి వచ్చితివి కావలయును- పాపము లోపలికి రమ్మనుము

భవా—(నిష్క్రమించి, మరలఁ జింతామణితోఁ బ్రవేశించును)

బిల్వ— (చింతామణిం జూచి తనలో) ఓహో!- యేమి సౌందర్యము! ఇది గణికయా - లేక, చక్కఁదనముల కణికయా !

ఉ. తెప్పలు వాల్పకుండిన, ధ ♦ రిత్రిని బాదము లంటకుండినం
దప్పక, రంభయో-మతిఘృ ♦ తాచియొ- మేనకయో-యటంచునీ
కప్పురగంధిపట్ల భ్రమ ♦ కల్గక పోవునె! యాలకింప లే
దిప్పరమందె యిట్టి జల ♦ జేక్షణ యున్న దటంచు నెన్నఁడుఁ !

చింతా—(తనలో) అవురా! యీజగన్మోహన మూర్తిని మరల నెంతకాలమునకుఁ జూడఁగలిగితిని ! (ఉపలక్షించి) సరి కాని-

ఉ. కమ్మలు లేకయే చెవులు • కస్తురితావులు గ్రమ్ము పత్రభం
గమ్ములు లేకె చెక్కిళులు • కాటుకనిగ్గులు లేకయే కనుల్
సొమ్ములు లేకయే గళము • చొక్కపులత్తుక పూఁత లేకె పా
దమ్ములు; సొంపు నింపును గ • దా! మగవారి యదృష్టమేమొకో!

(సమీపించి) అయ్యా ! దండములు ! తమయనుజ్ఞ నొందకయె తమసన్నిధికి వచ్చిన నాసాహసమును మన్నింతురుగాక !

బిల్వ—దానికేమి- నీవు విద్వాంసురాలవు గదా. కూర్చుండుము.

చింతా—క్షమింపుఁడు- నేను గూర్చుండుటకు రాలేదు-నాకుఁగొన్ని సందేహము లుండి మీవలనఁ దీర్చుకొని పోవలె నని వచ్చినాను.

బిల్వ—(నవ్వి) అట్లయిన, వాని నవశ్యముగా వినిపింపుము.

చింతా—చిత్తము. అన్నిటికంటెఁ జిత్ర మైన దేది ?

బిల్వ—ఈశ్వరవిలాసము !

చింతా—అత్యంత సుందరమైన దేది ?

బిల్వ—ప్రకృతి!

చింతా—అత్యంత భయంకర మైన దేది ?

బిల్వ—సంసారము!

చింతా—మనల, నేది విడిచినను విడువని దేది ?

బిల్వ—ఆశ !

చింతా—దేనిచేతను జావని దేది ?

బిల్వ—అహంకారము!

చింతా—ఎట్టి దారిద్ర్యమునందును సుఖపెట్టఁ గలుగున దేది ?

బిల్వ—తృప్తి!

చింతా—అన్నిటికంటెను బల మైన దేది ?

బిల్వ—అవసరము!

చింతా—అన్నిటికంటెను సులభ మైన దేది ?

బిల్వ—అన్యులకు సలహా చెప్పుట !

చింతా—అన్నిటికంటెఁ గష్టసాధ్య మయిన దేది ?

బిల్వ—తనతప్పు తాను దెలిసికొనుట!

చింతా—పాపముల నన్నిటిని బరిహరింపఁ గలిగిన దేది ?

బిల్వ—పశ్చాత్తాపము.

చింతా—సెబాసు ! ఈప్రశ్నముల కు త్తరములు చెప్పఁ గలిగినవారిని భాగ్యవశమున నిప్పటికిఁ జూడఁ గలిగితిని ! మహాభాగ ! చంద్రున కు నూలిపోగుం బలె-మీ యద్వితీయ పాండిత్యమున కిదిగో - యీ ముక్తావళిని సమర్పించుకొనుచున్నను. (అని తన మెడలోని ము త్తెములపేరు తీసి యతని మెడలో వేయును).

బిల్వ—అట్లయిన, నిన్ను నే నొకప్రశ్న మడిగెదను- దాని కు త్తర మొసఁగి నాచే నీవుఁగూడ బహుమాన మందుము.

చింతా—అవహితురాలనై యున్నాను. (తెరలోఁ జప్పుడు).

బిల్వ—(ఉలికిపడి) మిత్రమా ! బయటినుండి బండిచప్పుడు వినవచ్చుచున్నది- చూడు !- చూడు !-

భవా—(పోయి మరల సత్వరముగా వచ్చి) కొంప మునిఁగినది ! మీనాయనగారు వచ్చుచున్నారు !

బిల్వ—(త్రొట్రుపాటుతో) అట్లయిన నీవు చింతామణిని వెరటిదారి నింటికిఁ దీసికొని పొమ్ము. నే నీత్రోవను బోయి నాయనగారిం గలిసికొనెద. చింతామణీ ! నీవు ప్రాజ్ఞురాలవు కనుక నిందుల కన్యథా భావింప వని నమ్ముచున్నాను. (అనియు పేక్షతోఁ జూచును.)

చింతా—ఎంతమాట ! ఇందువలనఁ బునర్దర్శనలాభమున కవకాశ మేర్పడినది కదా ?

బిల్వ—(నవ్వి)అట్లే యగుఁ గాక ! అదిగో-బండి నిలిచినది! నే నిఁకఁ బోయెదను. (అని ప్రీతితోఁ జూచి నిష్క్రమించును).

భవా—(తనలో) పాచిక పారినట్లే కాని- వీరిచూపులు, వీరివాలకములుఁ జూచిన గుండె గుబేలు మనుచున్నది ! (అని చింతామణితో నిష్క్రమించును.)

ఇది చతుర్థాంకము.




# పంచమాంకము

ప్రథమరంగము :—బిల్వమంగళుని కార్యస్థానప్రాంతవీథి.

(బిల్వమంగళ భవానీశంకరుల ప్రవేశము.)

బిల్వ—రాత్రి నీవు మరల వత్తు వని చాలసేపు చూచితిని జుమా !

భవా—నీవు పురాణగోష్ఠిలో నుందు వని రా లేదు. మీ నాయనగా రేమియు ననుమానపడ లేదు గద ?

బిల్వ—లేదు కాని- యొక పొరపాటుమాత్రము జరిగినది! ఆతొందరలో నేను మెడలోని ముక్తావళితో నాయన యెదుటకు వెళ్ళితిని!

భవా—ఎంతప్రమాదము !- అప్పు డేమి జరిగినది ?

బిల్వ—ఆయన చూచి- ఇ దెక్కడి దని యడిగినారు. ఆపాటున నేమియుఁ బాలుపోక, అమ్మకమునకు వచ్చిన దని చెప్పినాను!

భవా—(తనలో) అబద్ధముల కప్పుడే మొదలు ! ఇదిగో యిదియే యీవ్యాపారములో నున్న చిక్కు !

సీ. సాని పైకమునకై • నణిగినయపుడెల్లఁ
జెన్నిధిఁ జేతఁ జూ • పింపవలయు
సానితల్లికి తిక్క • చనుదెంచి నపుడెల్ల
గేదఁగితేనె నా • కింపవలయు
ఇంటిలో నొత్తిడి • హెచ్చగు నపుడెల్ల
రెంట నూరక బూక • రింపవలయు
పయివారి కంటను • బడినపుడెల్లఁ జ
క్కని కట్టుకథలతోఁ • గ్రమ్మవలయు

పిన్న పెద్దలు చీవాట్లు ♦ పెట్టునపుడు
గొల్లుమని యేట్టులం బెట్టు ♦ కొనఁగవలయు ;
పవలు రే లిట్లు జారులు ♦ పాపభీతి
వదలి దబ్బర లాడక ♦ వలను పడదు!

(పయికి) మిత్రమా ! రాత్రి నానిమిత్తము నీ వంత యెదురు చూచిన దెందుకొఱకు ?

బిల్వ—ముక్తావళిం గొనిపోయి చింతామణి కిచ్చివేయుదు వని.

భవా—ఎంతమాట ! అది మెచ్చి మెడలో వేసిన వస్తువును మరలఁ బంపివేయుట కంటె పరిభవపఱుచుట మతే ముండును ? ఒక వేళ, మనము పంపినను పరిగ్రహించుటకుఁ జింతామణి యంత తెలివిమాలిన దనుకొంటివా ?

బిల్వ—అట్లయిన మన మిపుడు చేయవలసిన దేమి ?

భవా—చేయవలసినది తరువాతఁ జెప్పెదను గాని-చింతామణి సౌందర్యవిషయమున నీయభిప్రాయ మేమో ముందు చెప్పుము.

బిల్వ—సౌందర్యవిషయమున సాటి లేనిదే ! ఏమందువా ?–

సీ. మోము గోముగ నున్న ♦ ముంగురుల్ సున్న, ముం
గురులు గల్గిన మోము ♦ గోము సున్న
కనులు పెద్దవి యైనఁ ♦ గనుబొమల్ తఱుఁగును
గనుబొమ లమరినఁ ♦ గనులు తఱుఁగు
ముక్కు తీరుగ నున్నఁ ♦ జెక్కులు లొట్టలు
చెక్కిళ్లు లొప్పిన ♦ ముక్కు లొట్ట
కురులు దీర్ఘము లైనఁ ♦ గొక్కెర మెడ, మెడ
కుదురుగా నుండిన ♦ గురులు కుఱుచ
ఒకటి కుదిరిన నిట్టు లే ♦ యొకటి కుదుర
కుందు రేరినిఁ గాంచిన ♦ నుర్విలోన;
కాని, చింతామణి యటులు ♦ కాక- ప్రియ వ
యస్య ! సర్వాంగసుందరి ♦ యనఁగ నొప్పు.

భవా—సెబాసు ! నాఁడె మన నట్లుండవలెను ! సరి కాని- నిన్న దాని నేమో పరీక్షింపఁబోయితివి- దాని విద్యావిషయమున నీకింకను దగినంత తృప్తి కలుగలేదా యేమి ?

బిల్వ—తృప్తి కలుగక కాదు- ఆనెపముమీఁద నేనుగూడ దానికిఁ దగిన బహుమాన మేదైన నొసఁగవలె నని యనుకొంటిని.

భవా—అదిగో- ఆలోచన మన నది ! దాని ముక్తావళి మరల దాని కిచ్చివేయుటకంటె-అది బహూకరించినదానికన్న నధిక వస్తువుతో మరల దానిని బహూకరించుటయే మర్యాద.

బిల్వ—సరిలెమ్ము- మరల సమావేశ మెట్లు ?

భవా—దానికేమి-యీరాత్రి మనమే దానియింటికి బోయివత్తము.

బిల్వ—అమ్మయ్యో ! యెవరికంటనైనఁ బడినచో నెంతయపకీర్తి !

ఆ. కానిమాట జవము • గల చక్రములమీఁద
వడిగఁ బఱచు నాల్గు • వంకలకును ;
పఱచుచున్న కొలఁది • ప్రతిజనుఁ డాచక్ర
ముల కొకింత చమురు • పోయుచుండు !

భవా—నిజమే కాని- నీ కాభయ మక్కఱ లేదు. నిలువునఁ గన్నులున్నవాఁడుకూడఁ జూడకుండ నిన్నుఁ దీసికొనిపోయి దీసికొనివచ్చు భారము నాది. ఆపైని నేఁటిరాత్రి పట్టణములో నాటక మున్నది. ఆవంకదఁమీ వెళ్ళినచో నింటివారుగూడ ననుమాన పడుటకవకాశ ముండదు.

బిల్వ—(నవ్వుచు) ఇఁక నేమి ! యీవిషయమునందు నీకప్పుడే పాండిత్యముకూడఁ గుదిరినది ! సరి, యట్లే జరుగనిమ్ము కాని-సాయంకాలము నీవు సాపాటునకు మాయింటికే రమ్ము. మనరాక దానికి ముందు తెలియఁజేయుట మంచి దేమో ?

భవా—నీయొద్దనుండి వెళ్ళఁగానే నేను ముందుచేయుకార్య మదే.

బిల్వ—అట్లయిన వెళ్ళుము. నాకుఁగూడఁ జాల పని యున్నది.

(ఇద్దఱు నిష్క్రమింతురు.)

ద్వితీయ రంగము—చింతామణి సౌధము.

(చిత్రయు చింతామణియు ప్రవేశింతురు.)

చింతా—(నిలువుటద్దము నెదుట ముంగురులు దిద్దుకొనుచు) చిత్రా! పూలదండలమీఁదఁ బన్నీరు చల్లినావా ?

చిత్ర—(తములపాకులు సర్దుచు) నీళ్ళోడు-సల్లానుగానీ—నీవు తీసేసినదండ రేపు నా కియ్యాలి సుఁవాక్కయ్యా!

చింతా—(తనలో) పాపము ! పూలదండ కిది యెంత మొగమువాచియున్నదో ! భగవంతుఁ డేమిపాపము చేసినకన్నెలకుఁ బడపుఁగత్తెలయింట దాస్యమును, కోడఱికమును ! ప్రాప్తింపఁ జేయునో కాని-

గీ. సానికిని జారులకు మితి • లేని సేవ !
కూరయును నారయును లేని • కూడు ! సాని
కట్టిచించిన పుట్టము ! • కటికి నేల
పడుక ! నిలువెల్ల కోఁతలు • వాతలుఁ గద !

(పయికి) అట్లే యిచ్చెదఁ గాని- పునుఁగుడబ్బీ యేదీ ?

చిత్ర— (తెచ్చి యిచ్చును.)

చింతా—(పునుఁగు రాచికొనుచు) చిత్రా ! యీప్రొద్దు నాయలంకార మెట్లున్నదే ?

చిత్ర—నే సచ్చిపోయినట్టు !-సుక్కల్లో సూరేడులా గున్నా వక్కా!

చింతా—(నవ్వి) నీపోలిక బొగ్గు లయినట్లే యున్నది కాని- ఇదిగో డబ్బి—పాదుకంపు కొట్టక-నీవుకూడ రవంత రాచికొనుము.

చిత్ర—(చంకలు కొట్టుకొనుచు) వో ! వో ! యింకేఁ వింకేఁవి !-

చింతా—తాళు, తాళు !-(వినుట నభినయించి) గార్దభస్వరము విన వచ్చుచున్నది- సెట్టిగాఁడు కాఁబోలు నుట్టిపడుచున్నాఁడు !

చిత్ర—పాపం !-తిట్ట కక్కయ్యా!

చింతా—వెఱ్ఱిముండా ! విటులరోగములు నీ వేమెఱుఁగుదువు ?

సీ. పొగడీన నొక్కఁడు • పొంగి యాకస మంటుఁ
దిట్టిన నొకఁడు సం • తృప్తిఁ జెందు

అలిగిన నొకఁడు పా • దాక్రాంతుఁ డగు ; కాల
దన్నిన నొక్కఁడు • దాసుఁ డగును
పాడిన నొక్కఁడు • పారవశ్యము నొందు
గెంటిన నొక్కఁ డీ • ల్లంటి నుండు
కలుకుట్లు వెట్ట నొ • క్కఁడు కుక్కవలె నగు
త్రాగింప నొకఁడు వి • త్తంబు గురియు
పాపపుణ్యంబులకు నుది • భయము విడిచి
విటుల చిత్తంబు రజించు • విధము తెలిసి
నుసలినం జాలు ; మతిలేని • మాట కాని-
వలపుమందులు మఱివేఱె • కలవె మనకు!

సుబ్బి—కం. యెంతదయో సింతలపై
పంతంబున-పుల్చు గాచి-పడిపడి తాగన్
గొంతుకు- బొంగురు పోయెను-
దంతాలకు- పలుపు పుట్టె- తస్సాగొయ్యా!

(అని పాడుచుఁ బ్రవేశించి) అబ్బో! అబ్బో! యేఁవి సోకు!
యేఁవి సోకు! తగిలిం దేదో బేరం తగిలింది!

చింతా—నాకు బేరము తగులలేదు కాని-అట్టె వాగితివా- నీకుఁ జెంపకాయలు తగులును!

సుబ్బి—ఇదుగో! సిత్తరకూడ సిగేసి సీర కట్టిందే! అబ్బో! అబ్బో! అడుసు మొగాని కెంతెలు గొచ్చిందో!( అని బుగ్గమీఁదపొడుచును.)

చిత్ర—చీ! నీజిమ్మడ! గాజు లేయించుకుంటా నంటే కానిడబ్బు సేతులో పెట్టలేకపోయావు గాని-సడసాలుమాత్రఁ వాడతావు!

సుబ్బి—ఇదిగో రూపాయి! (అని రూపాయ మీఁదఁ బడవేసి) యిక సణిగావంటే సక్కలిగి లైడతా సూడు మఱి!

చింతా—సెట్టిగా రీశ్రాద్దు రూపాయలవాన కురియుదురు కాఁబోలు!

సుబ్బి—వో! అబ్బెంతరఁవేటి! సూస్తాను కాసుకో మఱి- లాబం- రెండు-మూడు-నాలుగు- (అని రూపాయలు మీఁద వేయును.)

చింగా—ఏమా పొగరు ! ఏకముగాఁ జేతి కీయ లేవా ?
సుబ్బి—అయితే మఱేంద !– (అని రూపాయలదొంతర చేతి కిచ్చును.)
చింతా—(పుచ్చుకొని) ఈపాటిదాని కేనా యీమిడిసిపాటు!
సుబ్బి—యేఁవో– నాకోసం ముస్తాబై కూకుంటా వనుకున్నా నా ?
చింతా—ఆఁ ! రమ్మని తిమ్మని బంతికి !– నీకోసమే యీముస్తాబు !
సుబ్బి—మఱీ– బవానీశంకరం కోసఁ వేనా యీ బా దంతా !
చింతా—అట్టె ప్రేలక–నోరు మూయుము !
సుబ్బి—నీదా నాదా ?– యిసిరాను! మాబాగా యిసిరాను !–యెం తమా టిసిరానో సూశావా ?
చింతా—ఏడిసినావు కాని– యేదీ కొర్నాటి కోక?
సుబ్బి—మాఅయ్యనచ్చినోడి మందులకోసం తిరుగుతూ– కొట్టుతియ్య డం లేందే కో కెల్లా వొస్తుంది ?
చింతా— అన్నట్లు అడుగ మఱచితిని– ఎట్లున్నది మీయయ్యకు ?
సుబ్బి—ఆడిబొందలా గుంది ! సావంటే సావూ కాదు– బతుకంటే బతుకూ కాదు ! నిన్నణ్ణుంచి ఆవేసంకూడా పుట్టింది.
చింతా—అన్నా ! పాపము !
సుబ్బి—పాపఁ వేంటి ?–అద్దూ పద్దూ లేకుండా ఆంబోతులాగు వూ రి కెగబడితే వూరికే పోతుందా ?
చింతా—కాదామఱి !–అందులకే నీ వింత హద్దు తప్పకున్నది !
సుబ్బి—అదుగో ! అదుగో ! తాటాకులు కాఁవోను ! బుగ్గల్ నులిఁ వి– బూర్లొండి పెడతా సూడు ! (అని సమీపింపఁబోవును.)
చింతా—దూరము! దగ్గఱకు వచ్చితివా– దవడపళ్ళు రాలఁగొట్టెద !
సుబ్బి—దూడోయి ! దూడ ! అందులో వోమాట అరు వెట్టావు ! సేత్తోనో–సెప్పుతోనో– సెప్ప లేదు !
శ్రీహ—(ప్రవేశించి) అమ్మి ! వారు వచ్చుచున్నారు– నీముస్తాబు తేలినదా లేదా ?–(సుబ్బిసెట్టిని జూచి) ఇదిగో ! యీయన యె ప్పుడు దిగినాఁడు ! ఏవయ్యా దుప్పట్లు ?

సుబ్బి—తల్లితోడు ! రేపు తప్పకుండా తెచ్చి పడేస్తా
శ్రీహ—ఇదిగో !- యిక్కడికి నాలుగు రేపు లయినవి! ఈ రేపుకూడ
చూచి- నీభరత నువ్వండు పట్టెదను! ఒకసారి క్రిందికి రమ్మా.
సుబ్బి—ఇదిగో యిదీ-యీామును డెవారం ! శనిగాళ్ళేగ సఁవయానికి
సకాక్కరావడం- సడసఁ వంతా సెడగొట్టడం! సన్నాసిముండను
సావైనా రాదేం ! (అని శ్రీహరివెంట నిష్క్రమించును.)
చింతా—(వినుట నభినయించి) అరుగో ! వచ్చిన ట్లున్నారు !- చి
త్రా ! నేను వసారాలోనికిఁ బోయి చేతులు కడుగుకొని వచ్చెద-
ఇంతలో నీవిచ్చటిసామగ్రినిదీసివేయుము (అని నిష్క్రమించును.)
(అంతట శ్రీహరియు, బిల్వమంగళ భవానీశంకరులును బ్రవేశింతురు.)
శ్రీహ—విన్నారా బాబు ! "గొప్పవా రింటి కరుదేరఁ గోటిధనము-
తనకు సిద్ధించినంత సంతసము కలుగు ", అన్నట్లు- మీరాకయే
మాకుఁ బదివేలు. " దయకుం గందువ, దానకేళి కిర, వంతశ్శుద్ధి
కిఁ జన్మభూమి, యుదారత్వము రచ్చపట్టు, జయలక్ష్మీలీలకుం బ
ట్టుగొమ్మ " అని యెల్లవారు మిమ్ములంగూర్చి చెప్పగా- ఎప్పుడై
న నా కాబాబుగారి దర్శనము లభించునా యనుకొనెడిదానను.
బిల్వ—(జనాంతికముగా) మిత్రమా ! యీముసలిదాని కింతపాండిత్య
మేమోయి ! వచ్చి క్షణము కాలేదు-వందపద్యములు విన్నాము!
శ్రీహ—అయ్యగారు నావాగుడుచూచి అసహ్యపడుచున్నట్లున్నారు!
భవా—కాదు కాదు- నీపాండిత్యమునకు నివ్వెఱపడుచున్నారు.
శ్రీహ—బాబు ! నాపాండిత్య మిప్పు డేమున్నది ! " పెద్దతనము వ
చ్చె బుద్ధి పెడతలఁ బట్టెఁ " అన్నట్లు- వయసు పోఁగానే సర్వ
ము పోయినవి. "వాణి జిహ్వాగ్రమునఁ దాండవం బొనర్చు ", అన్న
ట్లు నాలుగుగ్రంథములును నాలుకకొన నుండెడివి ! కంఠ మెత్తి
పాడితినా- " రహిముట్ట జంత్రగాత్రముల ఱాల్గఱఁగించు విమల
గాంధర్వంబు విద్య మాకు. " అన్నట్లు- ఱాళ్లు కఱఁగిన వన్న
మాటయే ! అయిన నేమిలాభము ! ఆ వయసిట్టె మరలఁగానే

"పూవులుముడిచిన యంగళ్ళనె-కలకల వీడెల్ల నవ్వఁ గట్టెలుమో సెఁ." అనుస్థితిలోనికి వచ్చినాను ! బాబుగారు నాసోదె వినుచు నిలువఁబడియే యున్నారు ! అమ్మీ ! యెక్కడ ?-అయ్యగారు దర్శన మిత్తు రని అన్నముకూడఁ గడుపునిండఁ దినకుండ లేచి యాయత్త మయితివి కదా-అయ్యగారు దయచేయఁగానే- వలపు ముందునకు, సిగ్గు వెనుకకు అనునట్లు-ఇల్లు దూరితి వేమి! బాబు! దానికి తగనిసిగ్గు-మాజాతిలోఁ బుట్టవలసినపిల్ల కాదు! మణిపూస!

చింతా—(మునిముని నగవులతోఁ బ్రవేశించి) దండములు ! లోపలికి దయచేయక యచ్చటనే నిలుచుంటి రేమి ?

బిల్వ—(తనలో) ఓహో ! యేమి యీజగన్మోహనాకారము !

చ. మురువుగ లేచు లేయనఁటి • మోక ; చిగిర్చిన మావిగున్న, ము మ్మరముగ మొగ్గ తాలిచిన • మల్లియ ; పూచిన జాజితీవె యుఁగా విరిసిన తమ్మిపూవు , నెర • విచ్చిన సంపెఁగ పూలగుత్తి ; యీ తరుణికి సాటి రా వనఁగఁ • దక్కినవాని ప్రమేయ మేటికిఁ !

మఱియు,

గీ. భక్తవర్యుని వైకుంఠ • పట్టణంబుఁ ;
గవివరేణ్యుని స్వర్గలో • కంబుఁ ; జిత్ర
కారు మేరుగిరీంద్ర మి • కాంత చెంతఁ
జెల్లిగవ్వకు నేనియుఁ • జెల్లఁ గలవె !

(అని భవానీశంకరునితో గదిలోనికిఁ బోయి కూర్చుండును.)

శ్రీహ—బాబు ! నా కిఁక సెలవు. " చెలువభాగ్యంబు దేవర చిత్తమింక " అన్నట్లు- మీచిత్తము, దానిభాగ్యము. (అని నిష్క్రమించు)

చింతా—చిత్రా ! యెక్కడ ?- యిటు వచ్చి యీ పూలవీవనతో వీరికి విసరుము. పంతులుగారికి నేఁ డేమి నామీఁద నింత నిర్హేతుక జాయమాన కటాక్షము వచ్చినది !

బిల్వ—(మందహాసముతో) నిర్హేతుక మేమి ?- సహేతుకమే. మా పరీక్ష యింకను దరువాయి యున్నది కదా ?

చింతా—ఆలాగునననా ?– అట్లయిన నదే ముందు కానిండు!

భవా—పయి పయి మాటలతో సప్పుడుకదు ! (అని జేబులోనుండి యొకపెట్టె తీసి) ఇదిగో యీదంతపుఁబెట్టెను జూచితివి కదా ?– తిన్నగ నిటు వచ్చి దీనిమీఁద నేమున్నవో పరికింపుము.

చింతా—(సన్నిపము సమీపించి) సర్పము—సంపెఁగపూవు– శివుఁడు– రాహువు– ఈ రూపములు చిత్రింపఁబడి యున్నవి.

భవా—అవునా ?– ఈపెట్టెలోని వస్తువున కివి కావలిగా నుంచ బడినవి. వీని నాధారము చేసికొని పెట్టెలోనివస్తు వేమో చెప్పఁగలిగినయెడల నావస్తువు నీది. ఆపైని నీవు కోరిన బహుమానము కూడ నొసఁగఁబడును.

చింతా—(బిల్వమంగళునితో) అచ్చా ! యెంతగూఢసమస్యను గల్పించినారు ! ఈయత్న మంతయు నన్నోడఁబుచ్చుట కేనా! సరి కానిండు !– (ఆలోచనతో) మొదటిది సర్పమా ?– సర్పము దేనిని హరింపఁ గలదు ?– మారుతమును ; మారుతము దేనికొఱకు వచ్చును ?–పరిమళముకొఱకు ; పరిమళము దేనియం దుండును ?– పుష్పాదులయందు ; అందువల్లఁ బెట్టెలోని వస్తువు పుష్పాదులలోనిది కావలెను. రెండవది సంపెఁగపూవు. సంపెఁగ దేనిని హరింప గలదు ? తుమ్మెదను ; తుమ్మెద దేనికొఱకు వచ్చును ? మకరందముకొఱకు ; మకరందము దేనియందుండును ? పుష్పమునందు. అందువలనఁ బెట్టెలోని వస్తువు పుష్ప మగుట నిశ్చయము. కాని, యేపుష్పమో తెలవలెను. మూఁడవది శివుఁడు. శివుఁ డెవరిని వారించును ?– మన్మథుని ; మన్మథున కేపుష్పములు కావలెను?–అరవిందము, అశోకము, చూతము, మల్లిక, నీలోత్పలము– ఇవి కావలెను ; అందువలనఁ బెట్టెలోని పుష్ప మీయైదింటిలో నొకటియై యుండవలెను. నాలవది రాహువు. రాహు వెవరికి శత్రువు?– సూర్యునకు ; సూర్యున కేపుష్పము ప్రియము ? అమ్మయ్యా ! గెలుచుకొంటిని ! చెప్పమనెదరా ?– పెట్టెలోనిది– కమలము!

ఇద్దఱు—సెబాస్ !- సెబాస్ ! (అని చప్పటులు గొట్టుదురు.)
భవా—ఇదిగో పెట్టె !- (అని యిచ్చును.)
చింతా—(పెట్టె తెఱచి) వట్టి కమలము కాదు- వజ్ర కమలము! (అని బయటికిఁ దీసి) ఓహో ! యెంతరమణీయముగా నున్నది !
బిల్వ—నీబుద్ధి దానికంటె వేయిరెట్లు రమణీయ మయినది ! పయి బహుమాన మేమి కోరెదవో కోరుము.
చింతా—(నవ్వుచు) కోరుట కేమి ! తీఱుట దుర్లభము !
బిల్వ—నాపట్ల నీ కట్టిసందేహ మవసరము లేదు. అటున్న సూర్యుఁ డిటు తిరిగినను- నే నాడి తప్పువాఁడను గాను.
చింతా—సరి కాసిందు- ఈమాటనిలుకడ యెంతవఱకో యిప్పుడే తేలఁ గలదు! నాకు బహుకాలమునుండి కామశాస్త్రము చదువు కొనవలె నని యున్నది. కాని, తగిన బోధకులు తటస్థపడనందున నింతవఱ కాకోరిక తీఱినది కాదు. మీ రది తీర్చినఁ జాలును.
బిల్వ—అన్నా ! చంపితివి కదా ! (అని వెనుకకుఁ జేరఁబడును)
చింతా—తేలినది చూచితిరా ?- అందులకే—
బిల్వ—ఆఁగాఁగు ! అప్పుడే తొటాకులు కట్టక కొంచెము నిదానించు!
చింతా—అట్లే, దానికేమి-ఆలోచించియే సెలవిండు. ఈలోపల నేను తములపాకులు చుట్టెదను.
బిల్వ—తములపాకుల కేమి కాని- యిక్కడఁ జాల నుక్కగా నున్నది. ఈ కోమటి మేడలో నే నిఁకఁ గూర్చుండఁ జాలను !
చింతా—అట్లయినఁ దోఁటలోఁ గూర్చుందము. చిత్రా ! యాపూల దండలు, పునుగువత్తులు, తములపాకులు నచటికిఁ గొనిరమ్ము. మనము వెళ్ళుదము రండు. (అని ముందు నడచును.)
భవా—(తనలో) ఈచిత్రనాటకము చివర కెట్లు ముగియునో చింతింప సాధ్యము కాకున్నది ! రాజుంజూచిన కనులతో మగనిం జూచిన మంట పుట్టు ననునట్లు కాదుగద! (అని వారిని వెంబడించును)

ఇది పంచమాంకము.




## షష్ఠాంకము

౧

ప్రథమ రంగము :—రాజవీథి.

భవా—(విషాదముతోఁ బ్రవేశించి) ఔరా ! యెంతపని చేసినది !

మ. నను దేవేంద్రునిగా నొనర్తు ననియెన్ ! • నన్నే నియోగించియా
తని రప్పించుకొనెం ! బ్రసూనశరశా • స్త్రం బభ్యసింపంగఁ బూ
నినరీతి న్నటియించి యాతని మనో • నీరేజముం జొచ్చి లోఁ
గొనియెం ! గుక్కనుజేసి నన్ను వెడలం • గొట్టెం దుద న్నిర్దయన్!

గీ. నేర్పుమై బిల్వమంగళు • నెత్తిగొట్టి
కూర్చు నాకు సుఖం బను • కొంటిఁ గాని—
అతని మరగి, నానెత్తియె • యడచి, చివర
కిట్లు కుత్తుక కోయునం • చెఱుఁగ నైతి !

(నిట్టూర్పుతో) ఎంత విశ్వాసహీనురాలో కాని—

చ. కలిగిన భాగ్య మెల్లను మొ • గంబునఁ బెట్టితి ! నిప్డు డిద్ది కా
వలె ననఁ దెచ్చి యిచ్చితిఁ ! బ • వళ్ళను రేలును నింటికుక్కనై
మెలఁగితి ! నేమి చేసినను • మెచ్చితిఁ ! దిట్టిన నవ్వితిం ! గటా!
తలఁపకపోయె నొక్కటియు • దానికి నేమి వినాశకాలమో !

అయినను, నాకీ ప్రాయశ్చిత్త మవశ్యముగాఁ గావలసినదే !

చ. నలువురు నోట గడ్డి యిడ • నవ్వులఁ బుచ్చితి ! నగ్గివంటి స
త్కులమును బుగ్గి చేసితిని ! • కోమలమై వికచాబ్జతుల్యమై
కలకలలాడు పెండ్లము మొ • గంబుఁ జతుర్థి శశాంకబింబముం
బలెఁ గననైతిఁ ! గట్టి కుడు • పం దగదే ననుఁ దత్ఫలం బిటుల్!

ఆశ్చర్యము ! అంతటి బిల్వమంగళుఁ డెంతలో నెట్లు మాఱెను!

సీ. పడఁపుఁగత్తియ కంటఁ • బడుట గిట్టనివాఁడు
గణికతోడిదియె లో • కముగ నుండె
మాపులు రమ్మన • మదిఁ దొట్రుపడువాఁడు
పట్టపగలె దారి • పట్టుచుండె !
అంగటి పన్నీటి • నంట నొల్లనివాఁడు
దాని చేతి జలంబె • త్రాగుచుండె !
ఆలిమాటకు సైత • మడుగు దాఁటనివాఁడు
తండ్రియాజ్ఞను గూడఁ • దప్పుచుండె !
పవలు రేయి-యనక • బహుశ్రద్ధతోడ వ్యా
పారగోష్ఠియందు • బరఁగువాఁడు
పవలు రేయి చీట్లు • పచ్చీసు, మున్నగు
క్రీడలందు నోల • లాడుచుండె !

సరి పోనిమ్ము-వానికర్మ మెట్లున్న నట్లగును ! ఇప్పుడు నాగతి యేమి ! (క్షణ మూరకుండి) దాని కాలోచన మే మున్నది ?- సర్వాంగక్షౌరమై సానులచేత వెడలఁగొట్టఁబడిన జారు లందఱకుఁ జివర కేమిగతియో-నాకు నదియే గతి !

గీ. దీర్ఘకారానివాసము • తీఱి వచ్చు
దొంగచందంబునం జని • దొడ్డిదారి
నింటఁ బడి, నీవె దిక్కని • యేడ్చి, భార్య
కాళ్ళమీఁదను బడుటయె • గతి చివరకు !

(ముందునకుఁ జూచి) ఎవ రా వచ్చువారు ! (నిదానించి) సుబ్బిసెట్టి ! పాపము – వీనిం జూచిన నాకు జాలివేయుచున్నది !

గీ. చిత్ర నటించి వెడఁగును • జేసి మునుపె
దొళ్ళదోఁపుగ ముండలు • దోఁచి రితని ;
తండ్రి చావఁగ నింటిపె • త్తనము వచ్చె
విడుతురె గుటుక్కునను మ్రింగి • వేయ కిపుడు !

సుబ్బి—(ప్రవేశించి)అబ్బో ! పంతులుగారే ! దండాలు ! దండాలు !
మీకు బాగ్గాలూ- మాకు లాబాలూ- యెక్కడా దరిసినాల్లేవు!
భవా—ఏమి దర్శనాలు యేమి లోకము !- చింతామణికిని నాకును
జెడిపోయినది- విన్నావా ?
సుబ్బి—యిన్నా నిన్నాను !
భవా—ఎవరు చెప్పినారు ?
సుబ్బి—యిప్పుడు మీరేగా సెప్పారు ! అస లెందు కొచ్చినట్టు ?
భవా—దానిమో జంతయు నిప్పుడు బిల్వమంగళునిమీఁదఁ బడినది !
సుబ్బి—అతగాడి కంతకంటే మోజుగా వుంది ! యేటొద్దు నంట-
యేడంతస్తుల మేడ కట్టిస్తా డంట !
భవా—కనుకనే దాని కంత కన్నులు మూసికొని పోయినవి !
సుబ్బి—(తనలో) మంచిపని జరిగింది ! మా మిడిసిపడేవోడు ! యె
ప్పు డీడికంట పడతానో అని యేక వొణికేవోణ్ణి ! (పయికి)
అయితే మటి- దానికి మీమీద తగనివోలు పని సెప్పేవోరుగా ?
భవా—అందులో సబద్ధము లేదు. కట్టుకొమ్మన్నచీఱ కట్టుకొనెడిది-
పెట్టుకొమ్మన్న నగ పెట్టుకొనెడిది. క్షణము కనఁబడకున్న సొప
డెడిది కాదు- నిమిషము మాటాడకున్న నిలువనిచ్చెడిది కాదు.
సుబ్బి—అయితే మటీ- అవోలుపంతా యిప్పు డేమయిపోయినట్టు ?
భవా—తల్లిముండ యేదో పెట్టి దానిమతి విఱిచివేసినది !
సుబ్బి—(తనలో) యెఱ్ఱిముకం ! యెంగళ ప్పెవ రంటే యితడు !
దానికి నామీదతప్ప దమ్మిడీయెత్తు వోలు పెవరిమీదా లేదు!
యీరాశ్శం దానితల్లే సెప్పింది కనక- యిందులో యేఁవీ కల్తీ
కూడా లేదన్నమాట ! (పయికి) యెవారఁవెల్లానదిస్తేయేం-సివరకు
శలామణీ దాంది! మల్లా యెక్కడయినా మంచికాతాఅమిర్నట్టా?
భవా—అమ్మయ్యో ! ఆరోంపిలో మరల నడుగు పెట్టుట కూడనా !
సీ. తల్లిపేరిటి మాఱు • దయ్యా మెప్పుడు దేసి
కై యగ్గి గురియునో • యనెడుబెంగ

యేపూఁట కాపూఁట ♦ యేమివ్యయంబు నె
త్తిని వచ్చి పడెడునో ♦ యనెడుబెంగ
కానింట లేనప్డు ♦ తార్పుడుకత్తె లె
వ్వానిఁ దెచ్చి కూర్తురో ♦ యనెడుబెంగ
యేవేళ బయటఁ గా ♦ లిడి సాని యెనరికం
టను బడిపోవునో ♦ యనెడుబెంగ
మేళముల కేఁగి నపుడు కా ♦ మించి యెవఁడు
తనకుఁ గొక్కిడఁ జూచునో ♦ యనెడుబెంగ
యిన్ని బెంగలచేత ♦ రే ♦ యింబవళులు
పొగలుటయె కాదె- వెలయాలి ♦ పొత్తనంగ !

సుబ్బి—అబ్బో ! అబ్బో ! యేంబుద్ది-యేంబుద్దీ ! యీబుద్ది మొద టే వుంటే- యింత గాశారఁవే లేకపోయేదిగా ?

భవా—అందుచేతనే- నీకుఁ గూడ నాగతి పట్టకముందే నిదురనుండి మేలుకొమ్మని చెప్పచున్నాను!

సుబ్బి—(తనలో) యీ రాకడ నే నెఱుగుదును ! యీవోడుపంతా ఆళ్లమీద నా కసయ్యం పుట్టించాలని ! నే నిల్లాంటి పాచికల్లో పడేవోణ్ణా! (పయికి) అయితే, అందుకు నన్నేఁవి సెయ్యమంటారు?

భవా—ఆసంగతి యటుంచి-ముందిది చెప్పుము: నీవాయింటికిఁ బోవుట నిజముగఁ జిత్ర నిమిత్తమేనా- లేక చింతామణి నిమిత్తమా ?

సుబ్బి—(తనలో) అయ్యల్లో ! ఆయువుప ట్టడిగేశాఁడో ! సిత్తారకోసఁ వంటే సిన్నతనం- సింతామణికోసఁ వంటే సిగ దొరకబుచ్చుకుంటాడు ! అందుకని, సల్లగా జారడం మంచిది. (పయికి) ఆసందులో బాకీలు కావల్సి అడావిడిగా యెల్తున్నాను. ఆన కొచ్చి కల్సుకుంటాను- యిప్పటి కిడిచిపెట్టండి. (అని నడచును.)

భవా—అట్లయిన నేను నతేవచ్చెద నడువుము. (అని వెంబడించును.)

సుబ్బి—(తనలో) సందులో బెట్టి సచ్చినోడు పీకి పిసగడుగంద ! కానీ-అంతపనొస్తే గట్టిగా అరవ లేకపోతానా!

(ఇద్దఱు నిష్క్రమింతురు.)

ద్వితీయరంగము :— చింతామణి యుద్యానము.

(చింతామణీ బిల్వమంగళులు ప్రవేశింతురు)

బిల్వ — ప్రేయసీ ! ఆబొండుమల్లెమొక్క సరసితివా !

గీ. ప్రకృతి శీర్షంబునందలి • పచ్చతాల
జిగిబిగి తురాయి చందాన • జిగురుపట్టె ;
జగములు జయింప సమకట్టు • స్మరునిచేతఁ
బొదలు నమ్ములపొది యన • మొగ్గ తొడిగె !

చింతా — మహాభాగ ! ఈవసంతములో మన మేడపని పూర్తి కాదా?

బిల్వ — అన్నట్లు నీతోఁ జెప్ప మఱచితిని — మనసిద్ధాంతిగారీశుక్ష్యవం చమినాఁడు గృహప్రవేశమునకు ముహూర్తము నిర్ణయించినారు.

చింతా — అప్పటికి మూడవ యంతస్తుపని ముగియునా ?

బిల్వ — అది కాకున్న నేమి — అందాఁక క్రిందియంతస్తులే చాలును.

చింతా — అట్లయిన యిపటినుంటియే యందులకు సన్నాహ మారంభింపవలసి యుండును గావలయును ?

బిల్వ — మిగతసన్నాహ మంతయు నాకువిడిచి; పట్టణమునందలి సానుల నందఱను విందునకు రప్పించుపనిమాత్రము నీవు చూడుము.

చింతా — ఆసంగతి యంత నొక్కి చెప్పుచున్నారు — క్రొత్తసానులమీఁదఁ గోరిక పుట్టినదా యేమి ?

బిల్వ — (నవ్వి) అబ్బే — అది కాదే — నీవిభవ మందఱుఁ జూచి యానందింపవలె నని నాకోరిక. అది కాక — మోహనాంగి మొన్న తనకూఁతురు రజస్వల కెంతయాడంబరము చేసినదో మఱచితివా ?

చింతా — (తనలో) చేయక దాని కేమి !

ఆ. ఇంటిలోనఁ బిల్లి • యీనినచో సాని
కొడుకు పెండ్లియంత • గొడవ పెంచు ;
గొప్పకొఱకు విటుఁడు • కొంపముమ్మయినఁ గొం
పోయి యిచ్చు దాని • ముద్దు తీర్చు !

బిల్వ—ఇదిగో !- యిప్పొద్దు జడ మాని, కొప్పిడిన ట్లున్నావు ?- కాని, పూలు లేక యది పూర్తిగ శోభిల్లుట లేదు!

ఆ. పూలకొప్పనంగఁ • బూరుష హృదయ క
వాట పాటన ప్ర • భావ కలిత
కంజశర శతఘ్ని • కా గోళ మని వచి
యింప నగును గాదె ? • యిగురుబోణి !

చింతా—(తనలో) విటులచర్యలు నాకు వింతగా నుండును !

గీ. భార్య కట్టక ముడువక • బానిసవలె
మసలుచున్నను పగవ రే • మాత్ర మెదను ;
గణిక యినుమంత వెలితిగాఁ • గానఁబడిన
మొత్తుకొందురు తమకొంప • మునిఁగినట్లు!

చిత్ర—(ప్రవేశించి) బావయ్యగారండీ ! మీగుమాస్తాగా రఁట- మీతో మాట్లాడా లంట- వొక్కసాఁవుసం దరిసెనఁ విప్పించాలంట.

బిల్వ—అఱసిముసముకూడ నవకాశము లే దన్నా నని చెప్పుము.

చిత్ర—సెప్పినా కదలకపోతేనో !

బిల్వ—తటాలున వెలుపలకు గెంటి తలుపు వేయుము.

చిత్ర—ఆలాగైతే- సిటిక ! (అని చిటికవేసి నిష్క్రమించును).

చింతా—మహాభాగా! యొక్కసారిపోయి యదేమో వినఁగూడదా?

బిల్వ—నా కిష్టము లేదు. ఈవిషయమునందు నీవేమియుఁ జెప్పవలదు.

చింతా—(తనలో) ఔరా ! నిప్పవంటివాఁ డెంతలో నివు రయ్యెను!

ఉ. పేరును బెంపు మాయు నను • భీతి నశించెను ! పండువంటి వ్యా
పారము సర్వముం బరుల • పా లగునన్న భయంబు వోయె ! సం
సారము దిబ్బ యా సనెడి • సందియముం జనె ! దీని కంతకుం
గారణ మేనొ- లేక, యల • కాముఁడొ దేవుఁ డెఱుంగఁగావలెఁ!

(తల పంకించి) పాపము ! కాముఁ డేమి చేసినాఁడు !

చ. పొలుపుగ బోడిమొద్దునకుఁ • బోటులు నేర్పినయట్లు ; చిల్కకుం
బలిమిని బచ్చిబూతు లల • వాటుగఁ జేసినయట్లు ; సద్గుణం

బులకు నిధానమై కొలికి • పూప యసం దగువాని గంగలోఁ
గలిపితి నేనె ! ఘోరనర • కంబు ఘటింపకపోనె దీనికిన్ !

బిల్వ—ప్రియురాలా ! యేమిటి యాలోచించుచున్నావు ?

చింతా—పనికలిగి వచ్చినవారిని బరామర్శింపకపోతిరి కదా యని.

బిల్వ—ఎంతపనిగలిగి వచ్చినను సరియే-నే నెవ్వరికిని పమయ మొసఁ
గఁ దలఁచుకొన లేదు. ఏమందువా ?-

చ. ప్రవిమల మైన నీదు ముఖ • పంకజముం గనులారఁ జూచుచుం,
దవిలి త్వదీయ వాగమృత • ధారలు శ్రోత్రపుటంబుల న్మహో
త్సవముగఁ గ్రోలుచుం ద్రిదివ•సౌఖ్యముభూతలమందెపొందు, నా
కెవరిప్రసక్తి యేల ? మఱి • యేమిటి కన్యవిచార మాత్మలోనన్?

చింతా—అయ్యయ్యో !- అట్లయిన వ్యాపార మడుగంటదా ?

బిల్వ—అందులకు నే నేమి చేయఁ గలను ?

ఉ. చూచినవేళ నెట్టిదియొ • చూడక యుండిన ని న్నిఁ కేమియుం
దోఁచదు; బైట కేఁగుటనఁ• ద్రొక్కడులాడు పదంబు; లేఁగినన్
వాచినకైవడిం గృహము • వంకకె లాఁగును డెంద ; మన్యకా
ర్యాచరణప్రసక్తి కికఁ • నబ్బుట యె ట్లవకాశ మంగనా !

చింతా—అట్లయిన, మీకు వ్యాపారచింతయే లే దన్నమాట!

బిల్వ—ఒక్కవ్యాపారచింతయే కాదు- నే నాకాశమునై, అందలిన
క్షత్రము లన్నియు నాకు నేత్రము లైనచో నిన్నుఁ దనివితీఱఁ జూ
డఁగలుగుదును గదా యనుచింత తక్క మ ఱేచింతయు లేదు.

చింతా—(నవ్వి తనలో) వలపు గ్రుడ్డి దనుమాట కర్థ మిదియే !

గీ. వేశ్యగా నన్నుఁ దలఁపఁడు ! • వేశ్య లనఁగఁ
గాముక మృగంబులకు భ్రాంతి • కలుగఁ జేసి
యీడ్చుకొనిపోవఁ జూచెడి • యెండమావు
లని యెఱుంగఁడు ! మోహాంధుఁ • డగుచు నితఁడు !

ఇట్టి యమాయికుని- ఇట్టి యనురాగపరవశుని- నాతల్లి దు
ర్బోధలవల్ల నేఁ జేయుచున్న మోసములకు లెక్క లేదు గదా !

చ. వలచినపూరుషు న్వలచు • భాగ్యము ; నమ్మినవాని నమ్ముచు
న్మెలఁగు సదృష్ట ; మండయయి • నిల్చినప్రాభవశాలి కండయై
నిలుచు విభూతి ; లేని యతి • నీచపుఁ బుట్టువు పుట్టుకంటె ని
య్యిల మరుభూమిలోన జని • యించుట మేలొక మంటిదిబ్బగాన్!

బిల్వ—(చేయెత్తి చూపుచు) ఓహో ! ఆ కాంచనవృక్షమునం దెంత పూలగుత్తి విడిచినదో ! (అని యటు నిష్క్రమించును)

చిత్ర—(ప్రవేశించి) అక్కయ్యా ! అమ్మేంచేసిందో యిన్నావా ?- అప్పులోళ్ళ బంట్రోతు ల్నింట్లో దాచి- సుబ్బిసెట్టి రాగానే పట్టి వొప్పగించింది ! ఆముండావోడు అగోరిస్తూ పోయాడు !

చింతా—(తనలో) శ్రీరామరామ! నేను పాపము పాప మని మొత్తుకొనుచున్నను- పదిరూకల కాశించి యెంతపని చేసినది !

ఆ. గాదిక్రిందికొక్కు • కరణి నున్నదియెల్ల
వడిగ వడిగఁ దోడి • వైచె మొదట!
నవల నూరినిండ • నప్పులు చేయించెఁ!
బట్టియిచ్చె రాజ • భటుల కిపుడు !

(క్షణ మాలోచించి, పయికి) మంచిది నీవు వెళ్లుము.

చిత్ర—(నిష్క్రమించును)

బిల్వ—(మరలఁ బ్రవేశించి)-ఈపూలగుత్తి యెట్లున్నదో చూచితివా?

చింతా—చూచితిఁ గాని- మిమ్ముల నొకటి కోరనా ?

బిల్వ—ఒకటి కాదు- వేయి కోరుము!

చింతా—పాపము! చిత్రకొఱకు మనయింటికి వచ్చు సుబ్బిసెట్టిని, అప్పులవాండ్రు, రాజభటులచేతఁ బట్టించి తీసికొనిపోయినారంట !- అతనిని విడిపించి మరల మనయింటివంకకు రాక - యేచిల్లరదుకాణమో పెట్టుకొని జీవించునట్లొడఁబఱిచి రావలెను.

బిల్వ—ఇంతియేకద! నీయాజ్ఞ యిప్పుడే నిర్వర్తించెద. రమ్ము పోదము.

(ఇద్దఱు నిష్క్రమింతురు)

ఇది షష్ఠాంకము.




# సప్తమాంకము

రంగము :—బిల్వమంగళుని సౌధము.

రాధ—(విషాదముతోఁ గూర్చుండి ప్రవేశించి) అక్కటా! నాప్రాణే
శ్వరునకు నే నెంత పగదాన నైపోతిని!

సీ. వచ్చుటే కష్ట మా • వనితను విడనాడి
వచ్చెనా ముండ్లపై • వలెనె నిలుచు!
చూచుటే కన్నెత్తి • చోద్యము నావంకఁ
జూచెనా నిప్పులు • సుఢీయఁ జూచు!
వినుటయే కల్ల నా • విజ్ఞాపనంబును
వినియెనా చెవి పెడఁ • బెట్టి వినును!
పలుకుటే నో రెత్తి • భాగ్యంబు నాతోడఁ
బలికెనా నిష్ఠురో • క్తులనె పలుకు!
పుణ్యవశమున నా కిట్టి • పూజ్యుఁ డైన
భర్త లభియించె నని గర్వ • పడితిఁ గాని
పతికిఁ జేదయి యిటు వగ • వంగవలసి
వచ్చు నని యెంచనైతి స్వ • ప్నమున నైన!

సీ. ఏతేరఁగనె లేచి • యెదు రేఁగ మొగ మవ్వ
లకుఁ ద్రిప్పి దారి తో • లంగి చనును!
స్నానంబునకు నుష్ణ • జలము తోర్పుచు నుండఁ
పోయి నూతికిఁ దోడి • పోసికొనును!
భుజియించుటకుఁ బీవ • బూని చెంతకుఁ బోవ
ముద్దులా గేల నా • మ్రోల ననును!

అడుఁజుట్టులు చేతి • కందీయు నులిమి మొ
'గంబునఁ గొట్టి చీ • కాకుపఱుపను !
మామగారి సరసి • నుఱి పొండనఁగ, నెడ
తెగని యాగ్రహంబు • తెచ్చికొనును !
భర్త చేత గడ్డి • పరకగా నిటు చూడఁ
బడెదు నాఁడుదాని • బ్రతుకు బ్రతుకె!

ఇంతకును– ఆయన స్వేచ్ఛకు నే నేమేని యడ్డు పోయితినా !

సీ. వేళకు విచ్చేసి • వేడిపదార్థముల్
సాపడి పోయినఁ • జాలు నంటి
దూరంబునుండియే • దుముదుము లాడక
చనవుగాఁ బలికినఁ • జాలు నంటి
నాపొత్తు రోసిన • నాసపర్యల నైన
సమ్మతి యొసఁగినఁ • జాలు నంటి
పవలురే లచ్చటఁ • బనిగట్టుకొని యున్న
క్షణ మింట నిలిచినఁ • జాలు నంటి
కరము వేదనపడు తండ్రి • గారి కొక్క
సారి కనిపించి పోయినఁ • జాలు నంటి ;
ఏమి ప్రారబ్ధమో కాని • యింతపాటి
కేని నోచ నయితి ! నింత • యేహ్య మయితి !

(నిట్టూర్పుతో) రెండుయామములు దాఁటినవి ! ఆచెవి నడ యీచెవికిఁ గొట్టుచున్నది ! ఇంతవఱకు భోజనమునకు రా లేదు ! ఆయన భుజింపకముందు పచ్చిమంచినీరు నోటఁబోసికొనుటకు నా కధికారము లేదుగదా? నాదురదృష్టమువల్ల నత్తగారు లేనే లేరు! ఉన్న మామగా రైనఁ దిన్నఁగ లేక– కుమారునిమీఁది బెంగచేత మంచము పట్టిరి! నాలుగు కాలములపా టాయన వైన బాగుండిన సరి కాని– లేకున్న నాపా ట్లడుగనా! ఎంతభాగ్య మున్న నేమి !

తెరలో —అమ్మా ! అమ్మా ! అయ్యగారు వచ్చుచున్నారు !

రాధ—(ఆప్యాయముతో ముందునకుఁ జూచి) అమ్మయ్యా ! నిజమే ! అరుగో ! వచ్చుచున్నారు! నావిచార మాయనకుఁ బొడకట్టకుండ నవ్వు మొగముతోఁ బ్రవర్తింపవలెను. (అని లేచి యెదురేఁగును)

బిల్వ—(చరచరఁ బ్రవేశించును).

రాధ—(నవ్వు మొగముతో) నేఁడు చాల ప్రొద్దుపోయినది-

బిల్వ—(చిరాకుతో) ఆసంగతి నాకుఁ దెలియును !

రాధ—స్నానమునకు నీరు తోరిపి సిద్ధముగా నుంచినాను-

బిల్వ—నా కీపూఁట స్నానము చేయుట కవకాశము లేదు. చింతామణికిఁ దలనొప్పి వచ్చినది- శీఘ్రముగాఁ బోవలెను.

రాధ—అయ్యో ! పాప మాలాగుననా !

బిల్వ—అబ్బా ! అదంతయు జాలియే కావలయును ! నిజముగా- నీ యేడుపుచేతనే పాపము దానికి పదేపదే జబ్బు చేయుచున్నది !

రాధ—రామ! రామ ! దాని నెన్నఁడైనఁ బల్లెత్తుమా టాడితినా ?

బిల్వ—పయికి కాడకున్న నేమి ?-నీకడుపులో నెంతకు ళ్ళున్నదో నే నెఱుఁగనా ! అది క్రొత్తమేడలో గృహప్రవేశ మగుచు, వచ్చి చూచిపోవలసిన దని వర్తమాన మంపినదికదా- రాఁ గలిగితివా ?

రాధ—ఇదియా నా యపరాధము ! నాథా ! మీయాజ్ఞ యైనచోఁ దప్పనిసరి కాని- అది రమ్మనుటయు నేను బోవుటయునా ?

బిల్వ—ఏమి స్వాతిశయము ! దానియాజ్ఞ నాయాజ్ఞ కా దేమి ?

రాధ—దురదృష్టమువల్ల నా కంత దూరాలోచన లేకపోయినది !

బిల్వ—(సాక్షేపముగా) ఏమిప్రాగల్భ్యము! (అని చరచర నడచును).

రాధ—(వెంబడించును).

బిల్వ—(చరాలున వెనుకకుఁ దిరిగి) వంటయింట నీపని యేమియు లేదు !- నీ విచ్చట నిలువవచ్చును! (అని నిష్క్రమించును).

రాధ—(కన్నీటితో) ఇదిగో ! యిది !- వరుస !

గీ. ఇట్టిప్రాణేశుఁ డింక నా • కెట్లు దక్కు !
ఈవిపత్తు నివారింప • నెవరు దిక్కు !

లేరె వెలయాండ్ర మరగిన • వారు ధరణి !
ఏడ నైనను జూతుమే • యిట్టిసరణి !

మామగా రనునట్లు—నామెత్తనయే యీయన నీస్థితికిఁ దెచ్చిన దేమో ! కాని- మీమ్మిప్పూటఁ గాసింత తెంపు వహించి చూచెద.

బిల్వ—(చేతులు తుడుచుకొనుచుఁ బ్రవేశించును).

రాధ—అప్పుడే భోజన మయినదా !

బిల్వ—(సాక్షేపముగా) నీ కప్పుడేవలె నున్నది కాఁబోలు !

రాధ—సరి పోనిండు, దాని కేమి,—మీతోఁ గొంచెము మాటాడవల సి యున్నది- యొకక్షణము కూర్చుందురా ?

బిల్వ—ఈపూఁట శీఘ్రముగాఁ బోవలసియున్న దని చెప్ప లేదా ?

రాధ—చెప్పినారు గాని- నావిజ్ఞప్తి వినువఱకు నేనీపూఁట మిమ్ముల ను వెళ్ళనీయఁ దలఁచుకొన లేదు. (అని యడ్డు చనును).

బిల్వ—ఏమీ ! పాకము చాల ముదిరినదే ! అట్లయినఁ గానిమ్ము- అదేమో వినియే వెళ్ళెదను. (అని చతికిలఁబడును).

రాధ—(ఎదుట నిలుచుండి) ప్రాణేశ్వరా !

ఉ. హైందవ సుందరీమణుల • కాత్మవిభుండె జగత్త్రయంబు ; త
చ్చందన పంక శీతల వి • శాల దృగంచల దృష్టియే మహా
నంద రసప్రసారి యగు • నాకము; లోకమునందు భర్తయే
యందనిమ్రానిపం డయిన • నక్కట! భార్య భరింపఁ గల్గునే ?

బిల్వ—సరియేగాని- చాలఁ బెద్దగాథ యెత్తుకొంటివి! నీచాటుభా రత మంతయు వినుచుఁ గూరుచుండుటకు నాకుఁ దెఱపి లేదు. ముచ్చుమూడుమాటలలోఁ జెప్పఁగలిగితివా చెప్పుము - లేదా—

రాధ—సరి దాని కేమి ?— సంగ్రహముగానే చెప్పెద.

సీ. అవనీధరాగ్రంబు • లాకాశవీధిని
బ్రేముడి మీఱఁ జుం • బించుచుండె
అల రవికిరణంబు • లవనీతలంబును
గొసరి కొసరి ముద్దు • గొనుచునుండె

జలధర సముదాయ • ములు పరస్పరమును
గ్రుచ్చి యక్కున నిడి • కొనుచునుండె
ఉదధితరంగంబు • లొకదాని నొక్కటి
కూర్మిఁ గౌఁగిటఁ జేర్చు • కొనుచునుండె
నిట్టిచో- భార్యలకు జీవి • తేశు లట్టి
పరమపావనమైన చుం • బనముఁ, దనివి
తీఱు నాలింగనముఁ బ్రసా • దింపకుంట
కంటె నన్యాయ మింకను • గలదె వేఱె ?

బిల్వ—ఇంతకు నీవు చెప్పఁదలఁచిన దిదియేనా? అవును అన్యాయమే! ముమ్మాటికి నన్యాయమే! కాని, దానికిప్పుడు కటకటపడిన లాభము లేదు- నాహృదయము పరాధీన మైపోయినది.

రాధ—అదియే నేను ముఖ్యముగా నడుగఁదలఁచినది ! ఎందువలనఁ బరాధీన మైనది?- నేను గురూపి నగుటచేతనా?- విద్యావిహీను రాల నగుటచేతనా- వినయసంపత్తి లేనిదాన నగుటచేతనా ?-

బిల్వ—చాలుఁ జాలు !- అట్లుచదువకు !- నీయందు లోప మున్న దని యెవ్వరు నన లేదు. రంభకంటెఁ జక్కనిదానవు- జాహ్నవి కంటెఁ బవిత్రురాలవు- భూమికంటె నోర్పు కలదానవు-

రాధ—అంతస్తోత్రపాఠ మెందులకుఁ గాని- నాయం దేదో లోప ముండవలెను. లేకున్న మీ కింతయనాదరము కలుగదు!

బిల్వ—(నవ్వుచు) అట్లయిన నాలోపమేమో చెప్పుమనెదవా ? పెండ్లి పెండ్లామ వగుటయే నీయందలి పెద్ద లోపము !-తెలిసినదా ?

రాధ—(కన్నీటితో) ప్రాణేశ్వరా ! పరితప్తహృదయ నైయున్న నాతోఁ బరిహాస మెందులకు ! మీయనాదరమువలన నాహృదయము కుమిలిపోవుచున్నది ! కులకాంత నిట్లు దుఃఖపెట్టుట కూడదు ! మీదర్శనమే నాకు దేవతాదర్శనము- మీసాన్నిధ్యమే నాకు స్వర్గము- మీయాదరమే నా కైశ్వర్యము- మీప్రేమయే నాప్రపంచము. నాజీవితము, నాచిత్తము, నాప్రేమ, నాదృక్కులు, నాసుఖము

నా యానందము, నా స్వర్గము, నా దైవము మీరు! నన్ను బ్రతికించుట కాని- చంపుట కాని- మీచేతిలో నున్నది! మీ రాదరింపనిచో నాజీవితమే వ్యర్థము. నాప్రాణము లిప్పటికే కంఠగతమైనవి! మీ రుపేక్షించినచో నిఁక నిలువవు! ఈక్షణమునందు నా గుండె యెంతతీవ్రముగాఁ గొట్టుకొనుచున్నదో చూడుఁడు! మీ హృదయమును నాహృదయముతోఁ జేర్చి యదిమిపట్టనియెడల నీగుండె యెప్పుడో పటాలున బ్రద్దలగును!

బిల్వ—(లేచి) వెఱ్ఱిదానా! యేల వగచెదవు?- మోహాంధకారము నన్నొక సల్లపూసను జేసివైచినది! పొంగుచున్న వ్యామోహ సముద్రమునందు నే నిపు డొకబిందువనై యున్నాను! వ్యసన ప్రవాహము నన్నెచ్చటికో నెట్టుకొనిపోవుచున్నది! ఈవరదలో నెందాఁకఁ గొట్టుకొనిపోవుదునో నాకే తెలియకున్నది! ప్రస్తుత మింతకంటెఁ జెప్పవలసిన దేమియు లేదు. ఈపరమార్థము మనసున నిడికొని, నామీఁద నిఁక నాస విడిచిపెట్టుము. ఎవరో వచ్చుచున్నారు- నే నిఁక వెళ్ళెదను. (అని ద్వారమువంకకుఁ నడచును)

దామో—(ప్రవేశించి) ఓహో! బావగారే! బహుకాలదర్శనము!

బిల్వ—(నవ్వుచు) ఓరి నీపుట్టిమునుఁగా!- నీ వెదురైతి వేమి!

దామో—అట్లయిన, దుశ్శకునదోష నివారణార్థము నీతోఁ గొంత దూరము వచ్చెద నడువుము. (అని వెంబడించును).

బిల్వ—కొంతదూర మేమి?- చింతామణి యింటికి రమ్ము- మంచి తాంబూల మిప్పించెదను.

దామో—అమ్మయ్యో! దానితాంబూలము దైవ మెఱుఁగును గాని నే నచటికి మాత్రము రాను!

బిల్వ—అదేమి?

దామో—ఏమా?- అక్కడ వేశ్యమాత యుండును! వేశ్యమాత యున్నను- వెఱ్ఱికుక్క యున్నను నాకుఁ జాల భయము!

బిల్వ—(నవ్వి) శ్రీహరి యిట్టిది కాదులే.

దామో— ఏమి ! చింతామణీ తల్లిపేరు శ్రీహరియా ! వహ్వా ! వహ్వా ! వరహాల కుప్పవంటి పేరోయి !

బిల్వ—అ దెట్లు ?

దామో—శ్రీ యనఁగా నైశ్వర్యము కదా ? హరి యనఁగా దానిని హరించునది యన్నమాట కదా ? ఇఁక నేమి !- యూరిలోని నీ వంటి యమాయికుల సిరి యంతయు హరించు దాని కిది యెంత సార్థకనామము ! దానికిఁ దోడు దానిభర్తునకు నరహరి యని నామకరణము చేసియున్నచో నింకను రక్తిగా నుండెడిది !

బిల్వ—శ్రీహరిని నీవు చూచియున్నచో ని ట్లనవు.

దామో—ఓయిదేవుఁడా ! చూడకేమి- చూచినాను ! ఒకసారి నేను నీకొఱకు వచ్చునరి కది గుమ్మములో నిలువఁబడి యున్నది. దానిముఖము చూడఁగానే- వెనుక మాపొలములోఁ జచ్చిపోయిన వరడు జ్ఞప్తికి వచ్చి, మీఁదిప్రాణములు మీఁదనె నిలిచిపోయినవి ! ముచ్చెమటలు పట్టి బట్టలు తడిసిపోయినవి ! ఆపాటున మఱి తిరిగి చూడక యదేపోకగ నింటికిఁ జక్కఁబోయితిని ! కాని, యారాత్రి కన్నుమూసిన నొట్టు ! తెప్ప వ్రాల్చితినా- ఆతాటిటెంకతల - ఆవరడు మొగము- ఆ గరిసిపోయిన కన్నులు- ఆ నూగు మీసము- ఆకప్పపళ్ళు- ఆపాగచూరిన పెదవులు- ఆబొక్కి దవడలు- ఆ నక్కమెడ- ఆచింపిపావడ గూడకట్టు- ఆమెఱుఁగుచూపిన మీఁగాళ్ళు- ఆరసకంతులు- ఆనల్లమందుకాయ- ఆయడపసంచి- ఆయారిపోయిన చుట్టపీఁకె- ఆయాకుచెప్పులు- ఆచేతికఱ్ఱ- ఆనోటితుంపరలు- ఆచొల్లు- ఇవి కట్టెదుటఁ బ్రత్యక్షము !

బిల్వ—(పకపక నవ్వి) ఓరి నీవర్ణన కాల! యెంతదండకము చదివితివి! పోనిమ్ము, దానిమాట కేమి కాని- చింతామణి చాల లెక్కగాఁ జెప్పఁ దగినది సుమా !

దామో—(సాక్షేపముగా)ఆలాగేమి!- ఎందులో ?

బిల్వ—మొదటిది-చక్కఁదనములో.

దామో—అలాగుననా ?- అట్లయిన నీ వింకను బెరటిదారినే యుంటి వన్నమాట ! సానులవిషయమునఁ జక్కఁదన మనుమాట కర్థమున్నదా ? ఆమొగమునందలి రంగుపూఁత- ఆజడచుట్టులోని వాలుసవరము - ఆకనుబొమలమీఁది కాటుక- ఆపెదవులయందలి లత్తుక- ఆదవడలమాటు తమ్మలము- ఆసంద్రెండుపటకాల పావడ- ఆజలతారువలువ పైట- ఆజూలు జుబ్బా- ఆతేరసొమ్ములు- తీసివేయించి, మాయావిడ కట్టుకొను మూసివాయనపుఁ జీరవంటి దానిని కట్టించి, నిలువఁబెట్టి చూచితివా- ఆ యందచందముల సంగతి యప్పుడు తెలును !

బిల్వ—చింతామణిని జూచినచో నీ సిద్ధాంతము మార్చుకొందువు!

దామో—నీకన్నులతోఁ జూచిన నీవన్నట్లే కావచ్చును గాని- మిత్రమా ! దానిమాయలో నింతసులభముగా నెట్లు తగులువడితివి ?

బిల్వ—అది యేమాయయు నెఱుఁగదు. ఏపూర్వజన్మ సంబంధముచే తనో మాకి ట్లొకరిమీఁద నొకరి కనురాగము కలిగినది.

దామో—వెఱ్ఱివాఁడా ! నీమాట సరియే- దాని కనురాగ మేమిటి?

గీ. ములగమొక్కకుఁ జేవ, వే • మునకుఁ దీపి,
కటికివానికి జాలి, చి • ల్కలకుఁ బ్రేమ,
గులకఱాతికిఁ గాంతి, బొ • గ్గునకుఁ దెలుపు,
పడపుఁగత్తెకు వలపు, వి • శ్వమునఁ గలవె ?

అది కాక-

క. ఇల బోయీ కొక పతి, మం
గలి కొక తల, భృంగమున కొ • కానొక పూవు
గలుములచెలి కొక తావును,
వెలవెలఁదుక కొక్కయాత్మ • విభుఁడును సతమే ?

బిల్వ—మిత్రమా! వేశ్యలపై నీ కేదో కోప ముండి-యిట్లనుచున్నావు!

దామో—పోనిమ్ము, నామాటకేమి !-నీ వన్నిగ్రంథములు చదివితివి కదా ?- యేకవియైన వారకాంతలకు వల పున్నట్లు వ్రాసెనా ?

బిల్వ—వారు వారకాంతల తత్త్వ మెఱుఁగ రనియే నానమ్మకము.

దామో—ఓహోహో ! యేమి నమ్మకము !

ఆ. భువి యెఱుంగనియది • దివి యెఱుంగనియది
రవి యెఱుంగనియది • కవి యెఱుంగు !
అట్టిదీర్ఘదర్శు • లగుకవివరు లాట
పొలఁతి నెఱుఁగలేక • పోయి రొక్కొ !

బిల్వ—పోనిమ్ము-వేశ్యలలో మాత్రము యోగ్యురాండ్రుండకూడదా?

దామో—కుమ్మరావములో నిత్తడిముంతలును- బడవుఁగత్తెలలో? బతివ్రతలును-ముందుమాట యేమోకాని-ఇంతవఱకుఁ బుట్టలేదు!

మ. జనుపాంథుం డగుఁ గాక! చోరుఁడును దుర్జాతుండు నౌగాక!రో
గ నికృష్టుం డగుఁగాక ! మద్యరతుఁ డౌ • గా! కన్నయౌగాక!త
జ్జనకుండే యగుఁ గాక ! హేయ భయ ల • జ్జాలేశము ల్లేక రూ
కనె కాంక్షించి శరీర మమ్ముకొను భో • గస్త్రీలకే యోగ్యతల్ ?

సీ. సంజపడంగానె • జడ యల్లుకొని, కంపు
తొలఁగ నీటను మేను • త్రొలఁచివైచి,
మొగమున మెఱుఁ గద్ది • ముంగురులం దిద్ది,
కనుబొమ్మలకుఁ గాటు • కను దగిల్చి
మాఱురైక ధరించి, • మాఱుపావడ తాల్చి,
నీటుగాఁ బలుచని • పైట వైచి,
విడియంబు చేఁగొని • వీధిగుమ్మము గాఁచి,
వచ్చిపోయెడువారి • వంకఁ జూచి,
" దండములు ! బొత్తిగా లేవు • దర్శనాలు !
రండు ! వెళ్ళిన నొ " ట్టని • రంగు చేసి
రూకయో- పోకయో- చుట్ట • పీఁకెయో- గ
డింపకుండను వేశ్య ని • ద్రింపఁ గలదె ?

బిల్వ—ఓరివాచాలుఁడా ! దోమాడ కరణమువలె నేఁడు నావెంటఁ బడితి వేమి ! చాలు- నిఁక వెనుకకు దయచేయుము !

దామో—మిత్రమా ! యీవిషయమునుగూర్చి నీతో ముచ్చటింపవ లెనని యెన్నిదినములనుండియో యెదురుచూచుచుండ, నేఁటికి సమయము చిక్కినది. పెక్కుమాట లేల ?–

చ. కులపతి చింతఁ బొంద, జన • కుండు నిరంతర మాత్మఁగుంద,బంధులు వెతఁ జెంద, స్నేహితులు• దుర్భరమాత్రపచేత డిందఁ, నెందుల కపవర్గదూర మగు • తుచ్ఛసుఖంబున కీవిధంబుగా బలి యగు ! దింకనైన నిలు • పట్టి మముం బరితోష పెట్టుమా !

బిల్వ—చెలికాఁడా ! యెందుల కాయాసపడెదవు ? నీమాట లేమియు నా కిప్పుడు నిక్కముగాఁ జెవుల కెక్కవు.

ఆ. అంటుమావిపండు • నారగించెడు తఱి
నుడు కటన్న నెవ్వఁ • దూరకుండు ?
జుంటితేనెఁ బ్రీతి • జుఱ్ఱెడు వేళ ను
చ్ఛిష్ట మనిన రోఁత • జెందు నెవఁడు ?

కాఁబట్టి, నీ విఁక కంఠశోష పడక వెనుకకు వెళ్ళిపొమ్ము !
(అని యతనిని నెట్టి నిష్క్రమించును).

దామో—ఔరా ! గణికావిష మెంత గాఢ మైనది !

గీ. సర్వవిషము నివారింపఁ • జాలినట్టి
మంత్ర తంత్రౌషధంబులు • మహిని గలవు ;
వారనారీవిషంబు ని • వారణంబు
సలుపఁగల మందు లేదు ము • జ్జగములందు !

మఱియొక విశేషము !–

ఆ. పాముకాటువలనఁ • బ్రాణముల్ మాత్రమే
పాయు ; వేశ్యకాటు • వలన జనుని
యశము, తెలివి, పుణ్య • మైశ్వర్య మారోగ్య
మాయువును దుదంట • పాయు నిజము !

(అని నిష్క్రమించును).

ఇది సప్తమాంకము.



# అష్టమాంకము

రంగము :—వాసుదేవమూర్తిగారిగది.

(మంచమునఁ బండుకొని వాసుదేవమూర్తిగారును, సమీపమునఁ భాగవత మొడిలో నిడికొని కూర్చుండి రాధయుఁ బ్రవేశింతురు).

రాధ—(దైన్యముతో) మరల మగత క్రమ్మిన ట్లున్నది! అన్నా! యెంతలో ముంచుకొనివచ్చినది! ఇదియంతయుఁ గుమారునిమీఁది బెంగచేతనే కదా?- సందియ మేమి ?-

ఉ. తనయుఁడు శుంఠ యైనఁ జెడు • దారిని బట్టి చరించుచున్న, నా ర్జనమునఁ బేద యైనఁ, గుల • సంకరుఁ డైన, రుజాశరీరుఁ డై నను, వెడఁ గైన, గౌరవ వి • నాశకుఁ డైన, విదేశగామి యై న, నెదఁ గృతఘ్నుఁ డైనను, మ • నంబునఁ దండ్రి సహింపఁగల్గునే!

(కుణ మూరకుండి)ఇరుగు లేదు, పొరుగు లేదు! కారడవిలోఁ గాఁపురము! ఆమీఁద నర్ధరాత్రము !! ఆపైని దెంపులేని వర్షము !!! ఇప్పటికిఁ బదివర్తమానములు వెళ్ళినవి - యింతవఱ కాయన రా లేదు ! ఈరాత్రి యెట్లు కడచునో-యేమి కానున్నదో- తెలియదు! అదిగో మరలఁ దెలివి వచ్చిన ట్లున్నది!

వాసు—(ఆయాసముతో) ఊఁ! ఊఁ! ఊఁ! అమ్మాయి!... అబ్బాయి...రానేలేదు కద ?

రాధ—వచ్చుచునేయుండురు. ఇప్పుడే యింకొకనింగూడఁ బంపినాను. ఇంతలో నిందాకఁటి తరువాయి చదువుదునా ?

వాసు—ఏమితరువాయి ?- ఆఁ! అవు నవును ! చదు వమ్మా ! చదువు!

రాధ—(పుస్తక మెత్తి పఠించును.)

మ. సిరికిం జెప్పఁడు శంఖచక్రయుగముం జేదోయి సంధింపఁ, డే
పరివారంబును జీరఁ, డభ్రగపతిం బన్నింపఁ, డాకర్ణికాం
తర ధమ్మిల్లముఁ జక్క నొత్తఁడు, వివాదప్రోద్ధత శ్రీకుచో
పరి చేలాంచలమైన వీడఁడు, గజప్రాణావనోత్సాహియై!

వాసు—ఓహోహో! ఏమి వాత్సల్యము! ఏమి ప్రేమ!... అన్నా!
అబ్బాయి... కందులో ... నజపీసమయిన లేక పోయినది కదా!

రాధ—అదుగో! మాటలోనే వచ్చినారు! (అనుచు దిగ్గన లేచును).

వాసు—ఏఁడీ! (అని శ్రమతో సగము లేచి ద్వారముపంకఁ జూచి)
నాయనా! వచ్చితివా! తడిసితివి కాఁబోలు నేమి?

బిల్వ—నాతడువున కేమి కాని-ఎందుల కన్ని వర్తమానము లంపినారు?

వాసు—ఎందులకా! నాకీరాత్రి గడవదు! కాశిలోనైనఁ జావవలెను-
కన్నకొడుకు చేతిలో నైనఁ జావవలెను... తెలిసినదా? అందులకు!

బిల్వ—మీకేమియు భయములేదు ఇంకను నూరేండ్లు బ్రతుకుదురు.

వాసు—ఎందులకు!- నీ భ్రష్టత చివరంటఁ జూచుటకా?

బిల్వ—మీయపోహమే కాని- నే నేమియు భ్రష్టుఁడను గాలేదు.

వాసు—అయ్యయ్యో! యింకేమి కావలెను నాయనా! కన్నతండ్రిని
గంటఁ జూచుట లేదు!- చేసికొనిన యాలిని జెంతకు రానిచ్చుట
లేదు! మాయముండ! ఆముండ యేమిమందు పెట్టినదో!—

బిల్వ—అదిగో! ఆరంభించినారు! ఇందులకే నా మొగము మీ కింత
దూర మైపోయినది! నన్ను వేయి యన్నను సరియే కాని- దానిని
పల్లెత్తుమాట యన్నచో నేను సహింపలేను. దానిగుణము మీ
రెఱుఁగరు. మీశరీరస్థితి యెట్లున్నదియు వెంటనే వచ్చి తెలుప
వలసిన దని యొట్టుపెట్టి నన్నుఁ బంపినది.

రాధ—(తనలో) అయ్యో దేవుఁడా! యీయన మరల నిప్పుడే దారి
పట్టుదురు కావలయును! కానిమ్ము-పడవవాఁడు పడవను దూరము
నకుఁ దీసికొని పోవునట్లు చేసెద. (అని పోయి మరల వచ్చును)

వాసు—నాయనా! నేను దాని నన్నను, ని న్నన్నను రవంత సేపు!

తరువాత మీ రెవరో!- నే నెవఁడనో! అట్లు కూర్చుండి నా
ప్రశ్నల కుత్తర మిమ్ము-సంవత్సరమునకు దినము లెన్ని?

బిల్వ—మూడువందల—యఱువది యైదు.

వాసు—దినమునకు గంట లెన్ని ?

బిల్వ—దినమునకు గంట లిరువదినాలుగు; గంటకు నిమిషము లఱువ
ది ; నిమిషమునకు క్షణికము లఱువది. మఱేమి చెప్పవలెను ?

వాసు—అందలి యొక క్షణికమునం దైన నీజీవిత మెట్లు కడచిపోవు
చున్నదో యాలోచించితివా ?

బిల్వ—ఇప్పుడు మాటాడవలసిన ముఖ్యవిషయ మింతకంటె మఱి లేదా?

వాసు—ఓరిమూర్ఖుఁడా! యిది యంత యముఖ్య మయినదఁటరా! ఎంత
కాల మిట్లు కన్నులు మూసికొని తిరిగెదవు ?

బిల్వ—సరి కాని- నన్నుఁగూర్చి మీ రట్టె శ్రమపడకుఁడు ! నామంచి
చెడ్డలనుగూర్చి నాకు మీపాటి తెలియకపో లేదు! అది గాక-

గీ. పక్కికందువు తెక్కలు • పడయువఱకె
తల్లితెక్కలనీడను • దారులాడు ;
అట్లె జనుఁడును స్వాతంత్ర్య • మబ్బువఱకె
తల్లిదండ్రుల చెప్పుచే • తల మెలంగు.

వాసు—ఆలాగేమి! అవు నవును!-పడుచుఁదనములో ప్రతిమానవుఁడు
ను దండ్రీకంటెఁ దానే యధికుఁ డనుకొనుట సహజమే! తండ్రి
చచ్చినవెనుకఁ గాని తదాధిక్యత తెలియదు ! సరి కాని- యొ
కసారి కన్నులు విచ్చి యాసుగుణరాసివంకఁ జూడుము ! ఎట్టి
నిక్షేపము నెడమకాలఁ దన్నుచుంటివిరా ! ముల్లోకములు శోధిం
చిన నిట్టిముత్తెము లభించునటరా ! సౌందర్యమునకా-సాటి లేదు;
ప్రవర్తనకా ప్రతి లేదు ! విద్యకు వాణి- వివేకమునకు శర్వాణి !
సన్నజాజిదండను సన్నెకంట నూఱుచుంటి వేమిరా !

రాధ—(చేతులు జోడించి) మామగారు ! నన్నుఁగూర్చి యాయన
మనస్సు నొప్పింపకుఁడు. నా దినములు మంచివికాక యాయనకు

నాయెడ నిట్టియనాదరము కలిగినది. మరల నాకు మంచిదినములు
రాఁగానే- యెప్పటివలె నాయనకే యనుగ్రహము రాఁగలదు.
వాసు—వింటివా ?—ఆమధురవాక్కులు వింటివా! అయ్యో ! అట్టి
యిల్లాలిపై నీ కెట్లు ప్రేమ పట్టిపోయినదిరా !
బిల్వ—ఎందులకు వృథా కంఠశోష! నూరు చెప్పండు వేయి చెప్పండు-
చింతామణిమీఁదినుండీ నాచిత్త మింక మరలదు !
వాసు—ఆఁ! అంతియేనా ! అట్లయిన నందులకుఁ దగినఫల మనుభ
వింతువు లెమ్ము ! నీ బుద్ధి మాఱ దని నిశ్చయించుకొనియే- యీ
వస్త్రైశ్వర్యమును కోడలిపేర నిదివఱకే వ్రాసి యుంచినాను. అ
మ్మాయి! నన్నొకసారి మెల్లగా నాపెట్టెకడకుఁ దీసికొనిపొమ్ము !
రాధ—(మామగారి నవలకుఁ దీసికొనిపోయి, మరల నొంటిగా వచ్చి)
ప్రాణేశ్వరా ! నా మామగారు నా కిచ్చిన సర్వస్వమును నేను
మీకు సమర్పించుకొనుచున్నాను. ఇదిగో పత్రము.(అనియిచ్చును.)
తెరలో—హా ! కృష్ణా ! కృ- ష్- ణా ! కుర్!
రాధ—( ఉలికిపడీ చూచి ) అయ్యో !- అయ్యో ! మామగారు
మనలను విడిచి పోవుచున్నారు ! (అని వడిగా నిష్క్రమించును.)
బిల్వ—(చూచి)హా! తండ్రీ!(అనిమూర్ఛిల్లి మరలలేచి) తండ్రీ!తండ్రీ!
ఉ. పిన్నటనాఁడె తల్లి నను • వీడి దివంబున కేఁగఁ బ్రేముడిన్
గన్నులలోనఁ బెట్టుకొని • కష్టములెల్ల సహించి, పెంచి, సం
పన్నునిఁ జేసి తన్నిటన • భాగ్యుని నన్నిఁక నీఋణంబు నే
నెన్నఁటికైన నొక్కలవ • మేనియుఁ దీర్చుకొనంగ నేర్తునే !
రాధ—(కన్నీటితోఁ బ్రవేశించి) ప్రాణేశ్వరా ! యోర్చుకొండు !
బిల్వ—అయ్యో ! యిఁక నెక్కడి యోర్పు !
చ. తనయభివృద్ధికోసము స • దా పలవించెడివాఁడు తండ్రి; యె
వ్వను దనమేలు గన్గొని ప్రమోదమునొందెడువాఁడుతండ్రి;యా
య్యాసఁ దనకీడుచూచిహృద • యంబునఁగుందెడువాఁడుతండ్రి; హా
జనకుఁడు లేనిజన్మ మొక • జన్మమె యన్యు లిఁకెంద ఋండెదన్!

రాధ—అది నిజమే కాని—

ఉ. పోయినవారికై దిగులు • పొందుట వెఱ్ఱితనంబు ; బుద్బుద
ప్రాయము లీశరీరములు; • పాయుటె నైజగుణంబు వీనికిన్;
పోయిరి సప్తసంయములు; • పోయిరి షోడశ చక్రవర్తులుం;
బోయిరి రామకృష్ణు; లిఁక • బోవకయుండఁగనేర్తురే యారుల్!

బిల్వ—(కన్నులు తుడుచుకొనుచు) కటకటా! యీ మహానుభావుఁ డింతలోనే యిట్లగు నని యించుకయు నెఱుఁగనైతినిగదా !—

(తెరలోఁ బెద్ద చప్పుడు)

బిల్వ—(ఉలికిపడి లేచి) అదేమి !

రాధ—మఱేమియు లేదు- ఎచ్చటనో పిడుగు పడినది.

బిల్వ—(ఆందోళనముతో) అమ్మయ్యో ! పిడుగే ! చింతామణికిఁ బిడుగన్న తగనిభయము కదా! (అని ద్వారమువంకకు నడచును).

రాధ—(వెంబడించి) ప్రాణేశ్వరా ! యెక్కడి కెక్కడికి !

బిల్వ—(ఆఁగకయే) ఇప్పు డీచ్చట నాపని యేమియు లేదు. తెల్లవారఁగానే వచ్చెదను. (అని నడచును).

రాధ—ఆఁ ! ఆఁ ! ధర్మము కాదు ! ధర్మముకాదు ! (అని పోయి చేయి పట్టుకొని) ఈశవజాగరణము నే నొంటిగాఁ జేయఁగలనా!

బిల్వ—ఇప్పుడు న న్నాఁప వలదు! చింతామణి కంటఁ బడినఁ గాని నాచిత్తము కుదుటపడదు! (అని విడిపించుకొని నిష్క్రమించును)

రాధ—(రొమ్ము బాదుకొనుచు) అయ్యో ! అయ్యో ! యెంతనిర్దయ ! యెంతనిరాదరము ! హా పరమేశ్వరా ! యిప్పుడు నాకు దిక్కెవరు ! మ్రొక్కెవరు ! తోడెవరు !— నీడెవరు ! ఓసిదుర్మార్గురాలా ! నా బ్రతుకు పదటఁ గలుపుటకు- నా కాఁపురము గంగపాలు సేయుటకు- నీ వెక్కడినుండి దాపుర మయితివే ! ఓజగదీశ్వరా! సంసారవృక్షముల కీవేరుపురుగుల నెందుకొఱకు సృజించితివి! వివేక కల్పలతల కీవిచ్చుకత్తుల నెందులకుఁ గల్పించితివి ! ఓ భరత ఖండమా ! యే దేశమునకు లేని యీనిర్భాగ్యసంతానము నీకెట్లు

సంప్రాప్త మయినది! అరుంధతీ అనసూయాదులవంటివారు పుట్టిన నీపవిత్రగర్భమునం దీయుమ్మెత్తవిత్తనము లెచ్చటినుండి వచ్చిపడి నవి ! ఓదేశబాంధవులారా ! మీ రేమి చేయుచున్నారు? ఓప్రజా నాయకులారా ! మీ రెచ్చట నిద్రపోవుచున్నారు ? ఎన్నిసంసార ములు కూలిపోవుచున్నవో మీకుఁ గానిపించుట లేదా ? ఎందఱు కులకాంతలు భర్తలముఖములకు మొగమువాచి విలపించుచున్నా రో మీకు వినిపించుట లేదా ? ఈ మహామారులను మారణము సేయ రేమి ! ఈప్రత్యక్షపిశాచములను పట్టిపల్లార్ప రేమి! ఈకప్ప కూఁత పాములను గసిమసంగ రేమి ! ఈ వెన్నమాటువిషఘుటి కలకు విఱుగుడు చూడ రేమి! ఓజగదీశ్వరా ! మా దేశము గొడ్డు పోయినది ! మాభరతమాత యిప్పుడు మగబిడ్డలం గనుట లేదు! పవిత్రములైన దేవాలయములలో- పరిశుద్ధములైన వివాహామందిర ములలో- ఆ పాపరాసులను, ఆ యెంగిలిమంగలములను, ఆ రోగ పంజరములను, నెదుట నిడుకొని- వారి బూతుపాటలకు, వారి బుగ్గపోటులకు పరవశులై పళ్ళిగిలించి పదులు వందలు సమర్పించు వా రీనీచవృత్తిని నివారింతు రనుట కల్ల ! నీవే యొకసారి మా వంకఁ గన్నెత్తి చూడుము ! మావలెనే వారినిగూడ వివాహితలం జేసి- మాదుఃఖమును, వారి దుర్యశమునుగూడ తొలఁగింపుము ! (ఉన్మాదముతో) హా! హా! హా! హా! నే నెక్కడికో పోవుచున్నా ను! నామీఁదఁ బూలవాన కురియుచున్నది! నాప్రాణేశ్వరుఁ డేఁడీ! (స్మృతితో) అన్నట్లు పాపాత్మురాలను- పడవ లేకుండఁ జేసితిని గదా ! అమ్మయ్యో ! నానాథుఁ డేమయిపోయినాఁడో ! (మరల నున్మాదముతోఁ బైకిఁ జూచుచు) ఎవరు చెపుమా నన్నుఁ బిలుచు చున్నారు ! అదిగో ! మామగారు ! అంబరవీథిని బుష్పకారూ ఢులై యరుగుచున్నారు ! ఏమీ ?- నన్నుఁగూడ రమ్మనుచున్నా రా ? ఇదిగో వచ్చుచున్నాను ! ఒక్కసారి నాహృదయేశ్వరుని పాదారవిందములను సందర్శించి యిప్పుడే వచ్చెద! (అని నిష్క్ర-)

ఇది యష్టమాంకము.




# నవమాంకము

## రంగము :—చింతామణి నూతన సౌధము

(మంచమునఁ బండుకొని చింతామణియుఁ
క్రింద పడుకవయిఁ గూర్చుండి చిత్రయుఁ బ్రవేశింతురు).

చిత్ర—అక్కయ్యా! యీపొద్దు గుళ్ళో మేళ మెందుకనీ ?

చింతా—నేఁడు కృష్ణాష్టమి కాదఁటే ?

చిత్ర—అంటే ?

చింతా—శ్రీకృష్ణుని జన్మదిన మన్న మాట.

చిత్ర—గొల్లకృష్టుడు కాక యాయ నింకోఁడా ?

చింతా—(నవ్వి) గొల్లకృష్ణుని నీ వెఱుఁగుదువు కాఁబోలు నేమి ?

చిత్ర—యరక్కేఁవీ ?—గొల్లోళ్ళ సీ రైత్తికెల్లినోఁ డేగా ?

చింతా—తప్పు! తప్పు! అట్లనఁగూడదు. ఆయన చాలగొప్పవాఁడు

చిత్ర—అంతగొప్పోఁడైతే మఱి—మనింటికి రాలే దేఁవీ ?

చింతా—వెఱ్ఱిముండా! ఆయన మనవంటివాండ్ర యిండ్లకు వచ్చునా ?

చిత్ర—అదేఁ వక్కయ్యా! నీకంటే సక్కనిసా నెక్కడుందీ?

చింతా—(వినక తనలో) ఆమహాత్ముని పాదారవిందములు సోకినచోట
గఱికపోచగా నైన పుట్టక-యీపాడుకులములో నేనేలపుట్టవలెను!

సీ. కడఁగి యా వైకుంఠుఁ • గడుపునఁ గనఁగ దే
వకి యాచరించిన • వ్రతము లేమొ!
పేర్మి నమ్మహానీయుఁ • బెంచి ముద్దాడ య
శోద కావించిన • సుకృత మేమొ!

అలరు చయ్యనఘుతో • నాట లాడఁగ గోప
పుత్త్రు లొనర్చిన • పుణ్య మేమొ :
చెలఁగి యా లోకేశు • చెట్టఁబట్టఁగ రుక్మి
ణీదేవి పూనిన • నీమ మేమొ
అమలచరితుఁ డైన • యా వేదవేద్యుని
బాంధవంబు, మైత్రి • పాలనంబుఁ
బడయుకొఱకు మున్ను • పాండురా ట్సూనులు
తద్ద సలిపినట్టి • తప మదేమొ!
(అని చింతించుచు నిద్రించును).

చిత్ర—అక్కయ్యకు నిద్ద రట్టింది! నేనుకూడా కాలుమీద కా లేసు కుని కమ్మగా తొంగుంటాను! (అని యట్లు చేయును).

కృష్ణు—(ప్రవేశించి) ఆద్యంతములు కాని, ఆకారము కాని లేక-అగోచరుఁడనై, అగమ్యుఁడనై చరాచరకోటులతో ననంతకోటి బ్రహ్మాండములను సృజించి పాలించుచున్న నాకు నాబిడ్డలు దేవుఁ డనియు, భగవంతుఁ డనియు; శివుఁడనియు, విష్ణువనియు; రాముఁ డనియుఁ, గృష్ణుఁ డనియు; అల్లా యనియు, గా డ్డనియు;నామము లుంచి యానందించుచున్నారు! ఏరికిని దెలియరాక, తెలిసికొనుట కవకాశ మొసఁగక, దాఁగుడుమూఁత లాడు నన్ను నాబిడ్డ లింత వఱకైనఁ గనిపెట్టఁ గలిగినందులకు సంతోషము!

అస్మత్కృతములైన అనంతకోటిబ్రహ్మాండములలో ననుక్షణము బని సేయుచున్నాను. ప్రతిపరమాణువును గదల్చుచుందును;ప్రతి మొగ్గకు రంగు లిడుచుందును; ప్రతి లతను బ్రాకించుచుందును; ప్రతిచెట్టును నిగుడ్చుచుందును; ప్రతిపురుగును నడపించుచుందును. ప్రతిప్రాణిచేతను బని సేయించుచున్నాను. ప్రతిజీవినిఁ బోషించు చున్నాను. నీటిలోని చేఁపకును, మంటిలోని వెల్లకును, ఱాతిలో ని కప్పకును, బొరియలోని చీమకును, చూరులోని యెలుకకును గూడ నేను నిరంతర మాహార మొసఁగుచున్నాను. కాని, మానవు

డిది యెల్లఁ గనులారఁ జూచుచుండియుఁ దనపొట్టయొక్క భారము తనపై నిడికొని, దానికొఱకు బడరానిబాములు పడును !

నాచిన్నిబిడ్డలగు మానవులకొఱకు నేను జేయని సదుపాయము లేదు. ఈనదు లన్నియు వారి జీవనముకొఱకుఁ గల్పించినాను. ఈవృక్షము లన్నియు వారి సౌఖ్యముకొఱకు సృజించినాను. ఈ సూర్యుని వారివెలుఁగునకై సృష్టించినాను. ఈచీఁకటిని వారి విశ్రాంతికై నిర్మించినాను. ఎప్పు డెద్ది యవసరమో యది ప్రసాదించుచుందును. ఎప్పు డెవ్వ రవసరమో వారిని బంపుచుందును. నాసామ్రాజ్యమునందు ఆనందమె కాని-దుఃఖము లేదు. నేనేమి చేసినను నాబిడ్డల మేలుకొఱకే కాని- కీడుకొఱకుఁ గాదు. ఇచ్చుటయుఁ, బుచ్చుకొనుటయు; నవ్వించుటయు, నేడిపించుటయు; పంపుటయు రప్పించుకొనుటయు; నావిలాసములు! ఇచ్చుటకే పుచ్చుకొందును; నవ్వించుటకే యేడిపింతును; ఉన్నతస్థాన మొసఁగుటకే రప్పించుకొందును.

కాని, భూమియందలి జీవరాసు లన్నిటిలో మానవులు చాల విపరీతస్థితిలో నున్నారు! మానవుల యభివృద్ధికొఱకు నేను వారి కధికజ్ఞానమును బ్రసాదించియున్నాను. కాని చంటిపిల్లవాని చేతికిఁ గత్తి యిచ్చినచో వాఁడు దానితోఁ దనచేతినే కోసికొనునట్లు- మానవులు తమ జ్ఞానముచేతఁ దమ్మే వంచించుకొనుచున్నారు ! మృగములు తమనేఁతఁ దా మార్జించుకొనఁ గలిగినతోడనే తల్లిని మఱచిపోవునట్లు- మానవులు కడుపు నిండినచోఁ దండ్రినగు నన్ను మఱచుచున్నారు! సకలసౌఖ్యములకు మూలమగు తృప్తికి మానవహృదయమునందుఁ జోటు లేకపోవుచున్నది! వారికి,భుజియించుటకు షడ్రసోపేతములైన బహుపదార్థములు కావలయును ! కట్టుటకు- వెలగల చీనిచీనాంబరములు కావలయును ! ధరించుటకు- రత్నభూషణములు కావలయును ! నివసించుటకు- దివ్యసౌధములు కావలయును ! పవ్వళించుటకు-హంసతూలికాతల్పములు కావలయును!

ఎక్కుటకు- యంత్రరథములు కావలయును ! అధికారమునకు- పదవులు కావలయును ! ఆడంబరమునకు- బిరుదములు కావలయు ను ! వీనినన్నిటిని బ్రసాదించినను విశ్వాసము సున్న ! తృప్తిశూ న్యము ! వారి మితిలేని వాంఛలు, వారి రాగద్వేషములు వారి వరస్పరాసూయలు, చూచి నేను మిగుల లజ్జపడుచుందును! కోటి కొంగ లొకచెట్టుమీఁద నివసించును- కాని, యిరువురు మానవు లొక యింట నివసింప లేరు ! ఒక కాకికి విపత్తు వచ్చినచో కోటి కాకులు మూఁగును- కాని, పొరుగింటివాఁడు చచ్చినను మానవుఁ డు తొంగి చూడఁడు ! ఒకనూకగింజ కంటఁ బడినచో చీమ కోటి చీమలను బిలుచును- కాని, మానవుఁడు తనకడఁ గోటిరూక లు న్నను దాను దినఁడు- పరులకుఁ బెట్టఁడు ! లతలు, వృక్షములు; క్రిములు, కీటకములుఁ గూడ నేదోవిధముగా లోకమున కుపకరించు చున్నవి. మానవుఁ డన్నిటిని దనయుపయోగములోనికిఁ దెచ్చు కొనుచుఁ, దానుమాత్ర ముపయోగము లేనివాఁడగుచున్నాఁడు! ఇవి యన్నియుఁ జూచి, యొక్కొకప్పుడు నేను వీరి నేల సృజించి పోతినా యని కించపడుచుందును !

అట్లయ్యు వారియందలి ప్రేమచే నన్ను వారేరూపమున భా వించినను బ్రసన్నుఁడ నగుదును. ఎన్నియపరాధము నొనర్చిన నొ క్కనుగుణ మున్నచోఁ జేపట్టుదును. ఎన్నిదోషములు సలిపిన నొక్కసారి త్రికరణశుద్ధిగ పశ్చాత్తాప పడినచో మన్నింతును. నాబిడ్డ పశ్చాత్తాపపడిన దినమే నాకు పండుగదినము! వీనులు నా వంకకు విచ్చినవారి కుపదేశింతును. కన్నులు నావంకకుఁ దెఱచిన వారికిఁ గానిపింతును. కాని, నాపై నాన యిడి కల్లలాడు కలుషమ తులను- "దేవుని యెదుట" నన్న నోటనె తెగబొంకు తెంపరులను జూచిమాత్రము సహింపఁజాలను !

సమస్త సద్గుణ సంపన్నురాలగు రాధ నా యనుగ్రహమును బడయుటలో నాశ్చర్యము లేదు. ఈచింతామణి యెంత చెడుదారిఁ

బట్టి చరించినను- హృదయమునందు దయాబీజము, భక్తిలవము పశ్చాత్తాపలేశము; వీనిం గలిగి నా ప్రేమకు పాత్రురా లైనది. ఆ మీఁద నిప్పుడు శ్రీకృష్ణునిగుండ నన్ను భావన చేసి తన్మయచిత్త ముతో నిదురించినది. అందువలనఁ గృష్ణరూపమున నే స్వప్నమున సాక్షాత్కరించి ప్రబోధింప వచ్చితినిగదా? ఈబిడ్డవలన బిల్వమంగళుఁడు కూడఁ బ్రబోధము పడయుఁ గాక ! ఈ యిరువురిచరిత్ర మనేకుల కాదర్శ మగుఁ గాక ! (అని తిరోహితుఁ డగును).

చింతా—కృష్ణా ! కృష్ణా ! పోకుము ! పోకుము ! (అని దిగ్గన లేచి)

శా. మాను ల్సంతతముం భజింపఁ గనిపిం • పంబోని నీ వెట్టులో
రా నేవచ్చితి మద్గృహంబునకు, ధ • ర్మంబే చన న్వచ్చి ? నీ
దాన న్నిక్కము రమ్ము రమ్ము! చనకీ • దాసిం గటాక్షింపు! బ్ర
హ్మానందం బిడె నీదుదర్శనము కృ • ష్ణా! దేవకీ నందనా !

(అని చంగున మంచము దిగి ముందునకు నడచును).

చిత్ర—(ఉలికిపడి లేచి) యేం టక్కయ్యా ! యేంటి ?

చింతా—వినిపించుకొనకయే) కృష్ణా ! కృష్ణా ! అనుగ్రహింపుము !

ఉ. పాపిని, భ్రష్టురాల, నతి • బాలిశనై బహునీచవృత్తిలో
రేపులు మాపులుం బడి చ • రించిన మాటయె నిక్క; మింక నా
పాపపుదారి ద్రొక్కను భ • వచ్చరణాబ్జ యుగంబు సాక్షిగా !
నాపయిఁ బ్రేమ నిల్పి యదు • నందన! కృష్ణ! తరింపఁ జేయవే!

(అనుచు వెఱ్ఱిదానివలెఁ బరిభ్రమించును)

చిత్ర—వోయమ్మల్లో! మాయక్కయ్యకు మతో యింది! (అని సమీపించి పట్టుకొని) యేం టక్కయ్యా! యేం టిది ?

చింతా—చిత్రా ! ఆ మహానుభావుఁ డేఁడే ?

చిత్ర—యే- యే- మానుబావుఁడు ?

చింతా—గోపాలకృష్ణుఁడే ! అయ్యో ! యింతలో నేమయ్యెను ?

చిత్ర—మనయింటికి రాం దేనా !- వస్తే కనపడట్టమ్మా ?

చింతా—వచ్చినాఁడే ! ఇప్పుడే కాదఁటే నేను గనులారఁ జూచితిని

ఉ. నల్లని మేనితోడఁ, జిఱు • నవ్వులు పర్వు లిడంగడు న్విరా
జిల్లెడు మోముతోడఁ, గృప • చిందెడు కన్నవతోడ, సందమా
పిల్లనగ్రోవితోడ, శిఖి • పింఛ కలాపముతోడ, నాయొడల్
జల్లుమనంగ వచ్చి, కృప • సంధిల నవ్వుచు నిల్చె ముందటన్!

చిత్ర—నిల్చి ?

చింతా—ఇట్లానతిచ్చెను :—

చ. కులసతులెల్ల నవ్వ, బుధ • కోటులు దవ్వుల కేఁగి నిల్వ, నీ
చులుసయితమ్ముఁ జుల్కనగఁ • జూచుచు నోసి! యటంచుఁ బిల్వ నెం
దుల కిటు పొట్టకోసమయి • తుచ్ఛపువృత్తి మెలంగఁ జూతు వో
చెలువ! ననుంభజింపు మెదఁ • జేకురు నీకు శుభంబు మత్కృపన్.

చిత్ర—అబ్బా! యెంతమాటన్నాఁడు !

చింతా—అయ్యో! ఆయన యన్నమాటలో నసత్య మేమున్నదే !

ఉ. గాడిద కెత్తు కెత్తు, ఘన • కంబున కీడనఁ దగ్గవారిముం
దాడియొ, పాడియో జగడ • మాడియొ, వేడియొ, లేక నవ్వియో
యేడిచియో, కలంచి కల • దెల్లను గుంజెదు పాపవృత్తిలో
నీడును జోడు లేక చరి • యించితి జేనెఁడు పొట్టకోసమై !

చిత్ర—అయితే యేఁవీ ?

చింతా—అయ్యో! యేమని యడిగెదవా !

ఉ. ఎందఱు నాకతాన భుజి • యింపఁగఁ గూడును, గట్ట బట్ట లే
కందును నిందు జోగు లయి • యల్లలనాడుచు నున్నవారలో!
ఎందఱు మందయానలు ని • జేశుల కోసము రాత్రియుం బవల్
కుంది కృశించి ప్రాణములు • గోల్పడిరో ! వచియింప శక్యమే !

అది గాక—

సీ. లజ్జయే స్త్రీల క • లంకార మనుమాట
కలనైనఁ దలఁపక • మెలఁగినాను !
మానాభిమానముల్ • మంటను గలిపి, పై
కమె ప్రాణవిభుఁడుగాఁ • గడపినాను !

పదిమందిలో బుగ్గ • పైని వ్రేలిడుకొని
యలయక తైతక్క • లాడినాను !
ఎట్టి హీనుం డైన • నేవగించుకొనక
యుచ్ఛిష్టమునకు నో • రొగ్గినాను !
చంక మగ బిడ్డ నిడికొని • జంకు లేక
యాఁడుబి డ్డని దీపము • లార్పినాను !
పుణ్యపాపంబు లను మాట • పూర్తిగాను
మఱచి యున్నాను ! నామేను • మాసిపోను !

చిత్ర—(వినుట నభినయించి) యెవరో తలుపు తట్టుతున్నారు !

చింతా—శ్రీకృష్ణభగవానుఁ డేమో చూడు!- చూడు!-

చిత్ర —(తలుపు తెఱచి) బావయ్యగారమ్మా !

బిల్వ—(తడిబట్టలతోఁ బ్రవేశించును)

చింతా—అయ్యయ్యో ! అదేమి ! అట్లు తడిసితిరి ?

బిల్వ—నాతడుపున కేమి కాని- యిందాక పిడుగు పడినప్పుడు నీవు జడిసికొన లేదు కద ?

చింతా—ఈశంక చేతఁ దండ్రిగారిని విడిచి చక్క వచ్చినారా యేమి !

బిల్వ—నేను విడిచి రా లేదు-ఆయనయే నన్ను విడిచి దివి కేఁగినారు!

చింతా—శ్రీరామ ! రామ ! (అని చెవులు మూసికొని క్షణ మూరకుండి) అట్లయిన, నట్టిస్థితిలో నిచ్చటి కెందులకు వచ్చినారు ?

బిల్వ—నిజము చెప్ప మనెదవా ?- నిన్ను విడిచి యుండలేక !

చింతా—హా ! యెంత ఘోరము !

ఆ. ఇంటఁ దండ్రి చచ్చె ! • ఏ రద్దముగ నుండె !
గాలివాన ! యంధ • కారసమయ !
మాలి నొంటి విడిచి • యరుదెంచె వేశ్యకై
యింత ఘోరకలి యిఁ • కేమి కలదు !

(అని యతనివంక నట్టె చూచి) ఆ నెత్తుటిమఱక లేమి !

బిల్వ—(చూచుకొని) అవు నవును! ఈగాయము లేని నెత్తు రేడదో!

చింతా—(క్షణ మాలోచించి) అన్నట్లు- ప్రాకారద్వారము మూసి యున్నది కదా—ఆవలినుండి మీరు లోపలి కెట్లు రాఁగలిగితిరి ?

బిల్వ—మన సుండిన మార్గము లేకుండునా ? వెలుపలినుండి పిలిచిన మీకు వినఁబడ దని గోడ దాఁటుటకు నిశ్చయించుకొని, యాధార ము నిమిత్తము మల్లెపందిరి యుండుచోటునకుఁ బోయి గోడమీఁది నుండి వెలుపలకు దిగు తీఁగెలకొఱకుఁ దడవులాడ నదృష్టవశమున త్రా డొకటి చేతి కందినది దాని నాధారము చేసికొని లోపలికి దిగితిని. కాని, యది త్రాటివలెఁ గఱకుగా లేక—మృదువుగా నున్న ట్లిప్పుడు స్ఫురణకు వచ్చుచున్నది !

చింతా—ఆలాగుననా?- అట్లయిన న దేమో చూచివత్తము రండు. (అని లాంతరు చేఁగొని నడచును)

బిల్వ—(వెంబడించును).

చింతా—(పూర్వోక్త స్థలమునకుఁ బోయి నిలిచి, దివ్వె పైకెత్తి చూచి, యదరిపాటుతో) అమ్మయ్యో ! త్రాడు కాదు! పాము !— అదిగో ! దానిపొట్ట విచ్చి రక్తము కారుచున్నది ! మీ యొడలి నెత్తుటి మఱకలు దానివే ! అన్నా-యెంత సాహసము చేసితిరి !

బిల్వ—దీని కేమి—యిది తెలియక చేసిన సాహసము—తెలిసి చేసిన సాహస మొకటి కలదు !

చింతా—అదేమి ?

బిల్వ—ఏటియొడ్డునకు వచ్చుసరికి పడవ లేక పోయినది. అంతట నీదుట కేమయిన నాధారము దొరకునా యని యేటిదరిని వెదకుచు రాఁగా, నొక చోట నొకశవము కాలికిఁ దగిలినది! దానిం దెప్పగాఁ జేసికొని యే రీది యీవలియొడ్డు చేరితిని !

చింతా—అంత విపరీత ముండునా ! నేను నమ్మఁజాలను !

బిల్వ—దానిని జలచరములపాలు సేయుట కిష్టము లేక దరిని జేర్చియే వచ్చితిని- నీ సందేహము తీర్చెద రమ్ము. (అనిచింతామణిని గొంచె మవ్వలకుఁ దోడుకొనిపోయి) అదిగో ! అటు చూడుము !

చింతా—(దివ్వె వెలుగునఁ జూచి) అమ్మయ్యో! నిజమే! స్త్రీశవము!
బిల్వ—(చూచి, సందేహముతో) ఏదేది!—దీప మింకొకసారి యటు
 తిన్నగాఁ జూపు! (అని పరిశీలించుచుఁ గొంచెము ముందున కేఁగి)
 హా! పరమేశ్వరా! (అని మూర్ఛిల్లును)
చింతా—అయ్యో! అయ్యో! అట్లుమూర్ఛిల్లితి రేమి! (అని యాం
 దోళనముతో సమీపించి లేవనెత్తి) మహాభాగ! యే మిది!
బిల్వ—(శోకముతో) అయ్యో! యింకేమున్నది! భగవంతుఁ డీరా
 త్రి నాకొఱకుఁ గష్టద్వారము తెఱచినాఁడు!
ఉ. తాలిమి భూమి కీ డయిన • దాని; వివేకమున న్మదాలసం
 బోలినదాని; శీలమునఁ • బుట్టిన యింటికి మెట్టునింటికిన్
 మేలు ఘటించుదాని; నను • మించినభక్తి భజించుదాని; ని
 ల్లాలిని జంపినైచితి! ని • రాదరణం బను దుర్విషంబునన్!
చింతా—ఏమీ! యీమె రాధయా! అయ్యో! అయ్యో! యీమె
 కిట్టిదుర్మరణ మెట్లు సంప్రాప్త మయినది!
బిల్వ—ఒంటిగాఁ దన్ను విడిచి పోవల దని యాక్కపెట్టున గోలవె
 ట్టుచుండ నేను వినిపించుకొనక చక్కవచ్చితిని! పిదప నన్నుఁ
 వెదకుచు నావెనుకనె వచ్చియుండును—చీఁకటిలో నన్నుఁ గనుఁ
 గొనఁజాలక గుండె వ్రీలి యీదృశావస్థం బొందియుండును!
చింతా—ఆహా! యేమి యిల్లాలు!

 గీ. బ్రతికియున్నంతవఱకును • భర్తృసేవ
 సలుపఁ గలిగినవా రుంద్రు • చాలమంది;
 చచ్చియుంగూడ భర్త కీ • సరణి సేవ
 యొనరుపంజాలు సతు లిల • నుండఁ బోరు!

సరి కాని-యిట్టి యిల్లాలి నొంటిగా శవజాగరణము సేయు మని విడిచివచ్చుటకు మీమన సెట్లొప్పినది? ఈమె దుర్మరణమువలన మీకు సంప్రాప్తమగు ఘోరపాతకమును మీ రెన్ని జన్మము లెత్తి తీర్చుకొనఁ గలరు!

బిల్వ— ఇది యక్రమమే కాని- యిందు నాదోష మంతగా లేదు ! నీ యందలి యనురాగము అన్యాలోచన లేకుండఁ జేసి యీవిధము గా న న్నీడ్చుకొని వచ్చినది !

చింతా—మహాభాగా ! మీరు పండితులరు కదా—యీయెంగిలికూటి పై మీ కింతయనురాగము కూడునా ?

బిల్వ—ఎంగిలికూడా ! ఏమిది- యెన్నఁడు లేనిది- నీనోటిగుండ నేఁ డీట్టి విపరీతవాక్కులు విన వచ్చుచున్నవి!

చింతా—అయ్యో ! ఇందు విపరీత మే మున్నది !

సీ. వల్లవు లెల్ల రే • పవళులుఁ దిరుగాడు
పంగడి రొక్కంపు • చాన మేను
విటులెల్ల నమలిన • వీడియ ముమిసెడు
పీకుదాను పడపు • వెలఁది నోరు
జారు లెల్లరు నోట • సంధించు నెంగిలి
కల్లుపాయ గడన • కత్తె మోవి
కాముకులెల్లఁ జ • క్కఁగ విశ్రమించు స
త్రంపుఁజావడీ సాని • దాని యురము
అనిశము భుజంగసంక్తుల • హస్తములను
వెలయు మంగలియద్దంబు • వేశ్య మనసు
అట్టి యుచ్ఛిష్టరాశిపై • నట్టి యూర
కుక్క కతికిన కూటిపైఁ • గూర్మి తగునె !

బిల్వ—నీయభిప్రాయము నా కిప్పుడు బోధపడినది కాని—నీ వెల్లవేశ్యల వంటిదానవు కా వని నాయూహ.

చింతా—తనసానిసట్లఁ బ్రతివిటునకు నిదే యూహ ! ఆదురోహమే మీకన్నులనుగూడఁ గప్పివైచినది కాని—నాయందు దాధిక్య మేమి యు లేదు !

బిల్వ—అట్లయిన, నాకన్నులను గప్పివైచినది జగన్మోహనకర మైన నీ సౌందర్యము కాని- నా దుర్మోహము కాదు !

చింతా—ఆలాగుననా ! మంచిది !— నే నిప్పుడే వచ్చెద—మీ రిచ్చటనే
కూర్చుండుఁడు ! (అని దీప మచ్చట నుంచి నిష్క్రమించును).

బిల్వ—(పశ్చాత్తాపముతో) ఔను !—దాని పల్కులలో నసందర్భ మే
మున్నది !—ఇప్పటికి నే నెన్నవవాఁడనో!—హా ! పరమేశ్వరా!

గీ. చదివితి సమస్తశాస్త్రముల్ ♦ చదివి యేమి
ఫలము ! తుద కిట్లు చెడుదారిఁ ♦ బడి చరించి
జనకు నిల్లాలినింగూడఁ ♦ జంపు కొంటి !
తలుఁగఁబోనట్టి ఘోరపా ♦ తకముఁ గంటి !

(క్షణ మూరకుండి) దుర్మోహముచేత కన్నులు మూసికొని
పోయి కాన లేకపోతిని గాని- యెప్పుడో తనగుండియ పటాలున
బ్రద్దలై తీఱు నని యెన్నిసారులో చెప్పియే యున్నది ! కటకటా!
యెంతమందభాగ్యుఁడ నైతిని !

సీ. తనకల్మియును జక్కఁ ♦ దనపుఁ బేర్మియుఁ జూచు
కొని గర్వపడనట్టి ♦ యనఘురాలు
ఏవేళ పరదేశు ♦ లేతెంచినను శ్రద్ధ
నాదరించిన మహి ♦ తాత్మురాలు
పనికత్తె లెంద ఱు ♦ న్నను నిమేషంబేని
యూరక యుండని ♦ యోగ్యురాలు
పుట్టింటివారు కే ♦ ల్వట్టి ప్రార్థించిన
పండుగకును బోని ♦ ప్రాజ్ఞురాలు
కోటిలో నొక్కతెగ లెక్క ♦ గొనఁగఁ దగిన
పరమపావనురాలు వి ♦ ద్యాంసురాలు
అట్టి మహితాత్మురాలు నా ♦ యట్టివాని
కకటా ! యెట్లు చివరంటఁ ♦ దక్క నేర్చు !

ఇంతకంటె దురవస్థ యిం కేమున్నది ?

సీ. పరమ విశుద్ధ మై ♦ ప్రఖ్యాతి వడసిన
కులమెల్ల నాచేత ♦ మలిన మయ్యె

కని పెంచి శ్రీమంతుఁ • గావించిన మహాను
భావుండు తండ్రి జీ • వంబు విడిచె
నను దైవముగ మది • నమ్మి సేవించిన
యాలి నాకై గుండె • వ్రీలి చచ్చె
కడు ప్రయాసముమీఁద • గడియించుకొనినట్టి
మర్యాద తుదముట్ట • మాసిపోయె
ప్రాణధనముగ నెంచి కా • పాడుకొన్న
శీల మామూలకంబుగ • శిథిల మయ్యె
సర్వవిధముల నిట్లు భ్ర • ష్టతను గాంచి
యెట్లు లీజీవితము భరి • యించువాఁడ !

చింతా—(అలంకార రహితయై, తల విరియఁబోసికొని, మలినాంబర ముతోఁ బ్రవేశించి) మహాభాగా! నా సౌందర్య మిపు డెట్లున్నది?

బిల్వ—(ఉలికిపడి) హా ! యిదేమి ! యిట్లు మాఱిపోతివి !

చింతా—నే నిపు డేమియు మాఱలేదు– ఇదియే నా నిజస్వరూపము!

సీ. చమురుజిడ్డు మొగంబు • చంద్రబింబం బంచు
పుసికన్నులను దమ్మి • పూవు లనుచు
చీమిడిముక్కు వి • చ్చిన నూవుఁబూ వంచు
వాలు చూపులు విరి • కోల లనుచు
చొల్లుపెదవి తేనె • జొబ్బిలు గని యంచు
పాలతిత్తులు పూల • బంతు లనుచు
కంపుతొడ లనంటి • కంబంబు లనుచును
చీడ పాదంబులు • చివురు లనుచు
రక్త మాంస పురీష మూ • త్రముల పాత్ర
మేలిమి పసిండి బొమ్మంచు • మెఱు పటంచు
నజ్ఞు లగువారు మోహాంధు • లగుచుఁ దలఁతు
రంతియేగాక సౌందర్య • మనఁగఁ గలదె ?

అది కాక—

సీ. వారాసి నడుమఁ దు • పానుల సందున
నావికపైఁ బయ • నంబు బ్రతుకు
పోటు పాటులు నలల్ • మేటి సుళ్ళుం గల్గి
యాఁగక చను ప్రవా • హంబు బ్రతుకు
భయ మోహములతోడ • భ్రాంతి తృష్ణలతోడఁ
బరఁగెడు వింతస్వ • ప్నంబు బ్రతుకు
ప్రతిపదంబున విఘ్న • బహుళంబులు నిరోధ
మాచరించెడు దేహ • యాత్ర బ్రతుకు
ముత్తియంబువోలె • మంజూరునం బొడ
కట్టునట్టి వాన • బొట్టు బ్రతుకు ;
అట్టిబ్రతుకు నమ్మి • యక్కటా ! దుర్మోహ
మందుఁ బ్రొద్దు గడప • నగునె జనుఁడు !

బిల్వ—(దిగ్గన లేచి) హా ! తల్లీ ! నమస్కారము ! నీవు నన్నుద్ధరింపఁ దలఁచిన చిత్స్వరూపిణివి కాని—చింతామణివి కావు ! (అని పాదములపైఁ బడును).

చింతా—(అంతలోఁ దప్పించుకొని) మహాభాగా ! యేమి యన్యాయమిది ! —నేను మీ దాసిని కానా ? (అని పట్టి లేవ నెత్తును).

బిల్వ—దాసివి కావు—ధర్మదేవతవు !

ఉ. తల్లిరో ! నీదు వాగమృత • ధారలు తేరి కొనంగఁ జేసె మా
ర్భల్లిన యంతరాత్మను ! న • శించెను గన్నులలోని కావరం
బెల్ల! శమించె నిక్కముగ • నింద్రియవాంఛలు! మేలుకాంచె నా
యుల్లము దుష్టమైన కల • నుండి ! యెఱింగితి నెల్ల దోషముల్!
సరికాని—యింతకాలము నన్నిట్లేల చీఁకటిలో నుంచితివి ?

చింతా—అయ్యో! యింతవఱకు నేను మీకంటె నెక్కుడు చీఁకటిలో నల్లాడుచున్న దానను! ఈపూఁట శ్రీకృష్ణభగవానుఁడు స్వప్నమున సాక్షాత్కరించి నన్ను వెలుఁగులోని కీడ్చి రక్షించెను !

బిల్వ—ఓహో ! యేమి యదృష్టవంతురాలవు ! నే నెంత పాపినో—

యెంత మందభాగ్యుఁడనో కాని—అమ్మహానుభావునకు నామీఁద
నాపాటి యనుగ్రహము కలుగకపోయినది !

సోమ—(అంతలోఁ బ్రవేశించి) కలుగకపో లేదు ! కాని, యీశ్వరవి
లాస మంతసులభముగాఁ దెలిసికొనుటకు సాధ్య మయినది కాదు!
ఆయన సంకల్పమే కాకున్న—ఇట్టిసమయమున నే నీప్రాంతమున
కు వచ్చుట కాని—గూఢముగా నుండి మీ ప్రసంగ మంతయు
నాలకించుట కాని— సంభవించియుండదు ! నే నెవ్వఁడ ననియా నీ
సందేహము ?—నన్ను సోమగిరియోగీంద్రుఁ డని వాడుదురు. గో
పాలస్వామి కోవెల యెదుట నన్ను సిద్ధమతము నాప్రస్తుతవు నె
లవు. పశ్చాత్తాపముచేత నీవు పునర్జన్మమును బడసితివి. అందువ
లన నీకు లీలాశుకుఁ డని నామకిరణ మొనర్చితిని. శ్రీకృష్ణమంత్ర
ముపదేశ మొనర్చెద నావెంట రమ్ము.

బిల్వ—స్వామీ ! యిదుగో వచ్చుచున్నాఁడను. (అని యాకసమువం
కఁ జేతులు మోడ్చి) ఓ పరమేశ్వరా ! యీరాత్రి నాకొఱకుఁ గ
ష్టద్వారమును దెఱచితి వను కొంటిఁ గాని—కాదు—మోక్షద్వా
రమే తెఱచితివి !

చ. ఎఱిఁగియు, బుద్ధిలేక, విష • యేచ్ఛఁ దగుల్వడి యున్న నాయెడం
బరమ దయామయుండ వయి • బంధువినాశముచేత దేహ మ
స్థిర మని చూపి ; యీసుదతి • చేతఁ బ్రబోధము గల్గఁజేసి స
ద్గురులనుగూడ నిట్టు లొన • గూర్చితి వేమన నీదు ప్రేముడిన్ !

(అని సోమగిరివెంట నిష్క్రమించును)

చింతా—(చేతులు మోడ్చి) ఓ శ్రీకృష్ణ భగవానుఁడా !

చ. కరము విచిత్రమై, కనక • గర్భున కైన నెఱుంగరాని దై
పరఁగును నీప్రభావ; మతి • పాపులకైన మొకింతపాటి నీ
కరుణకుఁ బాత్రులైన ఘృణ • కాలములోనఁ దరింపనేర్తు ! మా
చరితమె సాక్ష్య మిందులకు • సాధుజనావన ! లోక పావనా !

(అని నిష్క్రమించును).

ఇది నవమాంకము.




# ద శ మాం క ము

రంగము:—రాజవీధి.

భవా—(నీళ్ళకావడితోఁ బ్రవేశించి) కట్టా! చివర కెట్టిగతి పట్టినది !

చ. తెలివిని గోలుపోయి కడుఁ ◆ దెంపరినై, కనువెఱ్ఱిఁ జెంది, రో
వెలఁదుల మాయలం దగిలి ◆ విత్తము వారిపరంబుఁ జేసి, లో
కులకు గులామునై, కడుపు ◆ కోసము కావడి మోయుచుంటి! ని
స్తులముగఁ బూలు తాలిచిన ◆ చోటనె కట్టెలు మోసినట్లుగాఁ !

చ. నిలువున మాయలుం, గడుపు ◆ నిండ విషంబును గల్గి, పైకిఁ దే
నెలు గురియంగ నేర్చి, కడు ◆ నేర్పుగఁ బల్లవులం బకీరులన్
జలుపుచు వృత్తిగా మెలఁగు ◆ సానులఁజూచి భ్రమించు టెండమా
వులు గని నీరుటెంకు లని ◆ బుద్ధిఁ దలంచుట వంటిదే కదా !

(ముందునకుఁ జూచి) ఆ వచ్చునది చిత్రవలె నున్నదే!—
(నిదానించి) సందియ మేమి—అదియే ! చింతామణి యెప్పుడైన
నామాట తలపెట్టునేమో యడుగుదునా! (లజ్జతో) ఏమి భ్రాంతి!
"కలిపోసి పెట్టినను—ఉట్టివంక నే చూచె" నన్న ట్లున్నది !

చిత్ర—(కన్నీ రద్దుకొనుచుఁ బ్రవేశించి) బావయ్యగారు ! దండాలు!

భవా—అదేమి కంట నీ రిడుచున్నావు ! అందఱకు నేమ మేనా ?

చిత్ర—అయ్యో ! మీ రింకా యినలేదు కాఁబోను ! మాయక్క
య్యకూ- మాయమ్మకూ- మాబావయ్యగారికీకూడా వొక్కమా
టుగా మత్తోయింది !

భవా—(ఉలికిపడి) ఆఁ!- అ దేమిటి !

చిత్ర—మాయక్కయ్య కేవో—దేవుడు కల్లో కనిపించి సానివృత్తి మానెయ్యమనేసరికి సంసారం యిడిచిపెట్టి—సన్నాశం పుచ్చుకుంది ! మా బావయ్యగా రేవో— మటంలో పెవేశించారు ! మా యమ్మ కేవో— సొమ్మంతా పోయిం దని పిచ్చెత్తింది !

భవా—సొ మ్మెట్లు పోయినది !

చిత్ర—పోవటఁ వంటే పోవటం కాదు: మాయక్కయ్య యెవ రెవరి దగ్గిర యెంతెంతసొమ్ము చ్చుకుందో— అంతసొమ్మూ ఆరికి తిరిగీ యిచ్చేసింది ! నాపేరుమీద పదేలు కచేర్లోయేసింది! నన్నెవరైనా పెళ్ళాడితే— ఆరికి సగఁవంట నాకు సగఁవంట.

భవా—అట్లయిన నేను పెండ్లియాడుదునా !

చిత్ర—సేన ! యీసొమ్ముకూడా దేనికైనా పెట్టి— యిదివర కావిడ గొంతుకోసినట్టే—నాగొంతుక్కూడా కొయ్యడానికి కాఁవోసు!

భవా—సెబాసు ! మంచిమాటాడితివే ! సరికాని— ఇపు డెక్కడికి నీవు బయలుదేరినది ?

చిత్ర—మీకోసఁవే ! మీ సొమ్ములు కూడా యిచ్చెయ్యడానికి మా యక్కయ్య మిమ్మన్నీ— సుబ్బిసెట్టిగార్నీ— తిసుకురమ్మంది !

తెరలో—అట్లోయి పెసరట్లు ! అల్లఁ వేసిన పెసరట్లు !

కమ్మనేతి పెసరట్లు ! కానికిరెండు పెసరట్లు !

భవా—(విని) అదుగో సుబ్బిసెట్టి! అతఁడును నిటేవచ్చుచున్నాఁడు!

సుబ్బి—(పైరీతి నఱచుచుఁ ప్రవేశించి) అబ్బో ! అబ్బో! సిత్తరకాఁవోసు! సేన్నాళ్ళకు! కొంతపెసరట్టుమ క్కెడదాఁవంటే—కన్నొడుమనుకున్నా కాపణ్ణే కాపడ్డవేం! అన్నట్టు— మీయక్కయ్య సన్నాసుల్లో కలిసిందంట— అంత గాశారఁ వేఁ వొచ్చింది ?

భవా—ఒరి నీదుంప తెగ ! నీకు ముందే తెలిసినదా ! అది యెందులోఁ గలిసిన నేమి?—మనసొమ్ములు మనకిచ్చివేయునఁట వింటివా ?

సుబ్బి—ఏంటీ ! (అని యెగురుచు) అబ్బో ! అబ్బో ! అయితే యింకేఁవీ ! మల్లా వోయెలు గెలిగాఁ వన్నమాటే !

తెరలో—హా! కృష్ణా! భక్తపాలనతృష్ణా!

చ. కనుఁగవఁ గజ్జలంబును; మొ ♦ గంబునఁ గస్తురిబొట్టుఁ; గంఠసీ
మను వనమాల; పేరురము ♦ మధ్యను గౌస్తుభరత్నముం; గరం
బున నవవేణునాళమును ♦ మూర్ధమున శ్శిఖిపింఛరాజము
న్దనర మఱొక్కసారి యదు ♦ నందన! దర్శన మీయవే కృపన్!

చిత్ర—మాయక్కయ్య గొంతుక లా గుందే!–అదుగో ఆవిడే!

భవా—(చూచి) ఔరా! శృంగారరస మెంతలో శాంతరస మైనది!

గీ. తారహారంబులు తులసి ♦ పేరు లయ్యె!
పట్టువలిపెంబు జేగురు ♦ పుట్ట మయ్యె!
మదనమంత్రంబు శ్రీకృష్ణ ♦ మంత్ర మయ్యె!
భోగిని క్షణంబులో నయ్యె ♦ యోగినిగను!

చింతా—('కనుఁగవఁ గజ్జలంబు' అని పఠించుచుఁ బ్రవేశించును.)

భవా—చింతామణి! అదేమి–అట్లు మాఱిపోయితివి?

చింతా—నామార్పున కేమి లెండు–నావలెనే మీరుఁగూడ మాఱిపోవలె
నని కోరుచు మీయిరువురి నిమిత్తము, జెరిపది వేల రూపాయలను
బురపాలకుల యధీనము చేసినాను. వేశ్యా సంపర్కమువలన
మీరు పొందిన ఫలితము లోకమునఁ జాటుచు నాఱునెలలు తిరిగి
వచ్చిన మీఁదట మీ కాధన మొసఁగఁబడును. అంగీకారమేనా?

భవా—అంగీకారమే కాదు– అందుల కీక్షణమే మొదలు! (పరిక్రమించి)

సీ. ఇంట రంభలవంటి ♦ యింతు లుండఁగ సాని
సంపర్కముం గోరు ♦ చవటలార!
కొని పెంచినట్టి త ♦ క్కువజాతి ముండల
నెత్తిపై నిడుకొను ♦ నీచులార!
యెంత పెట్టినఁ దృప్తి ♦ యెఱుఁగని తొత్తుల
మెప్పుఁ గోరెదు వెంగ ♦ ళప్పలార!
యిచ్చకంబులు నమ్మి ♦ యిండ్లు వాకిళు లమ్మి
కొంపోయి యర్పించు ♦ కూళలార!

స్వానుభవ మిది తెలుపుచు • న్నాను వినుఁడు !
చచ్చి బ్రతికినవాఁడును • సానికొంపఁ
జొచ్చి మిగిలినవాఁడును • మచ్చుకేని
వసుధ నెందును లేఁడు ! దై • వంబు తోడు !

సీ. వేశ్యల నిజమునో • వీథిఁ బ్రవేశింపఁ
గాముని కైన శ • క్యంబు కాదు
వేశ్యాంగనల యింటి • వెచ్చంబులు భరింప
ధనదున కైన సా • ధ్యంబు కాదు
వేశ్య యెత్తించిన • వెట్టి నివారింప
నమరవైద్యుల కైన • నలవి కాదు
వేశ్యమాతలు నోరు • విప్పిన మాయింప
వాణీశునకు నైన • వశము కాదు

స్వానుభవ మిది తెలుపుచు • న్నాను వినుఁడు
చచ్చి బ్రతికినవాఁడును • సానికొంపఁ
జొచ్చి మిగిలినవాఁడును • మచ్చుకేని
వసుధ నెందును లేఁడు! దై • వంబు తోడు !

(అని యఱచుచు నొకవైపునకు నిష్క్రమించును.)

సుబ్బి—ఇదుగో! నేనుగూడా యిప్పుడే బైటెల్తున్నాను. (అని కొంచెము నడచి) ఇనండోయి! యెట్టిమొగాల్లారా! యిటినండి !

సీ. కానిరోజులు వచ్చి • కళ్లు మూసుకుపోయి
సల్లగా సానింటి • కెల్లినాను !
కొంగైన తగిలితే • కోటి లాబా లను
కొని దాని పాదాలు • కొలిచినాను !
నీమీద వలపంటె • నిజఁవు కాఁవో సని
బూరిలాగే పొంగి • పోయినాను !
తల్లికూతుళ్లు నా • తలకాయ నున్నగా
గొరిగివేసిందాక • తిరిగినాను !

సివర కందువోల్ల • సిప్ప సేతికి వచ్చె
కోఁవటోణ్ణి కనక • కూంత నయఁవు!
యెల్లబోకు డాళ్ళ • యిళ్ళ కెన్నఁడు, మన
కచ్చిరారు సాను • లమ్మతోడు!

సీ. యింటిలో కాలెట్ట • సిచ్చెండ కా నని
యేలకు యేలు గు • ప్పేసినాను
పిల్లి సోఁత్తాడింది • పెట్టాలి తి ళ్ళంటె
బళ్లతో సాఁవాన్లు • పంపినాను
యేపూట కాపూట • యెచ్చని సిరుతిళ్లు
పట్టికెల్లి యెదాన్ని • పెట్టినాను
మేళాని కెల్లొచ్చి • మెదలక తొంగుంటె
ఖిడియఁ విడిసి కాళ్లు • పిసిగినాను
అరద కేతిరికాడ • ఆరి కీరికి సీట్లు
మొయ్యామంటేకూడ • మోసినాను
యిన్ని చేసినోణ్ణె • యీడ్చిపారేశారు!
తక్కనోళ్ళమాట • లెక్క యేంటి?
యేఁవిలాబఁ వట్టి • యెదవల కొంపల
కెల్లకండి-యెత్తె • తల్లి తోడు!

(అని యఱచుచు నింకొక వైపునకు నిష్క్రమించును.)

చింతా—చిత్రా! నీ వింటి కేఁగి ముసలిదానిని భద్రముగాఁ జూచుచు, నేను జెప్పినట్లు నడచుకొనుము.

చిత్ర—(నిష్క్రమించును.)

చింతా—ఇక్కడ కీకార్య మయినది. నే నిఁక సానివాడ కరిగి వారిని మంచిదారిని బ్రవేశపెట్టుటకై ప్రయత్నించెద. (అని కొంచెము పరిక్రమించి, యాకసమువంకఁ జూచి)

సీ. జేసేఁడు పొట్టకై • మానంబు నిండు బ
జారున నమ్మి పిం • ఛారులార!

పసులపిల్లలఁ గొని • పడపు వృత్తికిఁ దార్చి
జీవనం బొనరించు • చెడిపెలార!
పురుషులమధ్యను • బుగ్గను వ్రేలిడి
తెయితక్క లాడెడు • దెష్టలార!
హేలికలై మెల్ల • రోలి! మోసీ! యనఁ
జిత్త మనుచు మ్రొక్కు • తొత్తులార!
సీత సావిత్రి మున్నగు • శీలవతులు
పుట్టి పెరిఁగిన యీపుణ్య • భూమి కెల్ల
లజ్జకుం గారణంబైన • లంజవృత్తి
మానుఁడీ! భూషణము స్త్రీకి • మానమె సుఁడీ!
సీ. ఎంత పోషించిన • నెల్లకాలంబు మీ
యొడలి బింకము నిల్చి • యుండఁబోదు
ఎంత మెప్పించిన • నెన్నఁడు జారుల
కొక్కచోటనె బుద్ధి • యుండఁబోదు
ఎంతటి వైశ్వర్య • వంతుఁ డబ్బిన సాధ్వి
కుండెడు గౌరవ • ముండఁబోదు
ఎంత గడించిన • నేమి వార్ధకమున
నుదరంబునకుఁ గూడె • యుండఁబోదు
ఎందులకు మీరలు వివేక • మెడలి యిట్లు
గోతఁ బడి, యజ్ఞులం బట్టి • గోత దింత్రు!
లజ్జకుం గారణంబైన • లంజ వృత్తి
మానుఁడీ! భూషణము స్త్రీకి • మానమె సుఁడీ!
తెరలో—శ్లో. చింతామణి ర్జయతు సోమగిరి ర్గురు ర్మే
శిక్షాగురుశ్చ భగవాన్ శిఖిపింఛమౌళిః
యత్పాద కల్పతరు పల్లవ శేఖరేషు
లీలాస్వయంవరరసం లభతే జయశ్రీః.

అదుగో! మహాభాగుఁడు! కాదు కాదు- లీలాశుకయోగీంద్రుఁడు!
ఓహో! యీ ప్రశాంత వేష మెంత మనోహరముగా నున్నది !!

బిల్వ—(కాషాయాంబరములతో, నీశ్లోకమును బఠించుచుఁ బ్రవేశించి-ఆకసమువంకఁ జూచుచు) తండ్రీ! యే దేదీ !- నీజగన్మోహనాకార మింకొకసారి చూపుము !- ఆఁ !

శ్లో. కస్తూరీతిలకం లలాటఫలకే, వక్షస్థలే కౌస్తుభం
నాసాగ్రే నవమౌక్తికం, కరతలే వేణుం, కరే కంకణం
సర్వాంగే హరిచందనంచ కలయన్, కంఠేచ ముక్తావళిం
గోపస్త్రీ పరివేష్టితో విజయతే గోపాలచూడామణిః.

(కొంచెము పరిక్రమించి) కృష్ణా! యేమిటి- చేయుచున్నావు?
(నిదానించి) ఓహో! తెలిసినది- తెలిసినది !

శ్లో. కాళిందీపులినే తమాలనిబిడచ్ఛాయే పురస్సంచర
త్తోయే తోయజపత్ర పాత్ర నిహితం దధ్యన్న మశ్నాతియః
వామేపాణితలే నిధాయ మధురం వేణుం, విషాణం కటి,
ప్రాంతే గాశ్చ విలోకయన్ ప్రతికలం తం బాల మాలోకయే.

చింతా—(తనలో) ఓహో ? యీమహానుభావున కీశ్వరసాక్షాత్కార మెంతలో సిద్ధించినది !

చ. వనములఁ బెద్దకాల ముప • వాసములుం జపముం దపం బొనర్చిన మునికోటి కేనియును • జేకుర నేరని వాసుదేవు దర్శనము ప్రతిక్షణంబును వి • శంకటలీల లభించుచుండె ! నేమని వినుతింప వచ్చు నవు • రా ! సుకృతంబన నిద్దియేకదా

(సమీపించి) స్వామీ! యెక్కడికి- బయలు వెడలినారు ?

బిల్వ—(దృష్టి మార్పకయే) ఎవరు మీరు ?

చింతా—మీ దాసిని- చింతామణిని.

బిల్వ—(వెంటనే చేతులు మోడ్చి) హా! తల్లీ! నీవా! (అని "చింతామణి ర్జయతు" యను శ్లోకమును బఠించును.)

చింతా—(ఆనందాశ్రులతో) మీ ప్రయాణ మెచ్చటికో సెలవీయలేదు

బిల్వ—అమ్మా! నాప్రయాణము మథురానగరమునకు. అదిగదా-
ఆ శ్రీకృష్ణభగవానుఁ డవతరించిన పుణ్యస్థలము!
చింతా—ఇచ్చటి మీవిథు లన్నియు నిర్వర్తింపఁబడినవా ?
బిల్వ—దామోదరునిచేఁ దండ్రిగారికిని, ధర్మపత్నికిని సంస్కార వి
ధులు జరిపించినాను. యావదైశ్వర్యమును సత్కార్యముల కర్పిం
చినాను. తల్లీ! నేనొసర్పవలసిన దింకేమేని యున్నచో నానతిమ్మా.
చింతా—అట్లయిన మీ రిఁక నొసర్పవలసిన దాశీర్వాదముమాత్రమే.
బిల్వ—నీయభిప్రాయము తెలిసినది.

సీ. పాపకృత్యములలో • బహునికృష్టం బగు
వ్యభిచారము వినాశ • మందుఁ గాక!
మనదేశమున కెల్ల • మచ్చను గల్గించు
గణికాకులము మార్పఁ • గాంచుఁ గాక!
విటులు దుర్వృత్తులు • విడనాడి భార్యలఁ
గూర్మిమీఱఁగ నేలు • కొంద్రు గాక!
పతి పరకామినీ • రతుఁ డయ్యె ననుచింత
యువతు లెన్నఁ డెఱుంగ • కుంద్రు గాక!
బ్రతుకు చంచల మని; దైవ • భక్తి మోక్ష
సాధనం బని; యనుతాప • సంగతులగు
వారిపై దేవునకు దయ • వచ్చు నని; యె
ఱింగి మానవు లెల్లఁ ద • రింత్రు గాక!

శ్రీమజ్జగద్గురు శంకరభగవత్పాద ప్రసాదాసాదిత మహాకవిబిరుదాంక
భారద్వాజస గోత్రార్ణవ శశాంక, కవిఘంటా కలాప హస్త
కాళ్లకూర్యన్వయ ప్రశస్త, బంగారురాజ కవిరాజ
తనూజ, నారాయణరాయామాత్య బిడౌజ
ప్రణీతంబగు చింతామణీ ప్రకరణము
సంపూర్ణము.

